
DADDY


MUMMY


AND...
I






EKCO
SKETCH PEN
FOR
SKETCHING
COLOURING • SIGNING

# రాజు కొండ ఎక్కేందుకు వెళ్ళాడు



















రాజు వరుస తప్పకుండా న్యూట్రాముల్ హాయిగా తాగుతాడు. న్యూట్రాముల్ అముల్‌వారి ఆరోగ్యాన్నిచ్చే, రుచికరమైన పానీయం. న్యూట్రాముల్ బలవర్ధకమైన, మీగడగల అముల్ పాలతోపాటు, అసలైన కోకో, మాల్ట్, పంచదార కలసిన మిశ్రమం.

అరే, ఆశ్చర్యం! న్యూట్రాముల్ ఖరీదు కూడా తక్కువే. 500 గ్రాముల న్యూట్రాముల్ మీకు అందుబాటయే వెల రూ. 12.21. స్థానిక పన్నులు, సెంట్రల్ సేల్స్‌ట్యాక్స్, రవాణా ఛార్జీలు అదనం.

రాజుకి, ఇప్పుడిక శంకర్‌కి, ఇంకా దేశమంతటా వేలాది మందికి రోజూ న్యూట్రాముల్ తాగడం అంటే ఎంతో ఇష్టం.



**అముల్ వారి న్యూట్రాముల్**

ప్రతి కప్పూ మీకు పోషణను ఇచ్చు

daCunha/N/3 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''అరణ్యకుడు''] బూర్లె నాగేశ్వరరావు రచన. డిసెంబరు నెల బేతాళకథ కోలార్ కృష్ణఅయ్యర్ రచన అని పాఠకులు గ్రహించగోరుతాము.

ఈ సంచిక నుంచి చందమామలో, బాల సంవత్సరం చిహ్నంగా ''పురాణబాలల'' కథలు వెలువడతాయి.

## అమరవాణి

గురులాఘవ మర్థానాం
ఆరంభే కర్మణాం ఫలం,
దోషం వా యో న జానాతి
స బాల ఇతి హోచ్యతే. 1

[ఎవడు పని ప్రారంభిస్తూ దాని ఎక్కువ, తక్కువలనూ, మంచి, చెడ్డలనూ తెలుసుకోడో వాణ్ణి మూఢుడు అంటారు.]

సంపుటి 64 జనవరి '79 సంచిక 1

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**అయికా సత్యనారాయణ, సూళ్ళూరుపేట (ఆంధ్ర)**

ప్ర: వర్షాలు ఎలా కురుస్తాయి? వర్షపు నీరు ఆకాశంలో ఎలా నిలవ ఉంటుంది? సాధారణంగా వర్షాలు అక్టోబర్, నవంబర్ మాసాలలో కురుస్తాయి, ఎందుచేత? వడగళ్ళవాన ఎలా ఏర్పడుతుంది?

స: భూమి మీది అన్ని ద్రవ్య రాసులలాగే నీరు కూడా భూమియొక్క ఆకర్షణ శక్తి మూలంగా భూమిని అంటిపెట్టుకుని ఉన్నది. అయితే నీరు కాగినప్పుడు ఆవిరిగా మారటం మనకు తెలుసు. వేడెక్కినప్పుడు నీటి అణువుల చలనశక్తి హెచ్చుతుంది. కాచకుండానే నీరు ఆవిరి కావటం మనకు తెలుసు. బట్టలు తడి ఆరిపోతాయి. బిందెలలో ఉండే నీరు కొద్ది రోజులలో ఇగిరి, ఆవిరిగా మారిపోతుంది. నీటి రూపంలో ఉన్న అణువులకన్న ఆవిరి రూపంలో ఉన్న అణువులకు హెచ్చు వేగం ఉంటుంది. (భూమియొక్క ఆకర్షణ శక్తి నుంచి తప్పించుకుని విశాలాకాశంలోకి పోవటానికి కావలసిన వేగాన్ని "పలాయన వేగం" అంటారు. నీటి అణువులు కూడా ఏ కారణం చేతనైనా పలాయన వేగాన్ని అందుకోగలిగితే అవి భూమినుంచి తప్పించుకుపోతాయి. చంద్రుడి మీద పలాయన వేగం చాలా తక్కువ, ఎందుకంటే చంద్రగోళం మీద ఆకర్షణశక్తి భూమితో పోల్చితే అయిదోవంతు మాత్రమే. అందుచేత ఒకప్పుడు చంద్రుడి మీద నీరు ఉండినా అది ఎప్పుడో చంద్రుణ్ణి విడిచిపోయి ఉండాలి.)

ఆవిరిగా మారిన నీరు ఆకాశంలోకి వెళ్ళి, ధూళి కణాలతో చేరి మేఘంగా ఏర్పడుతుంది. ఇనుముతో చేసిన ఓడ నీటిలో తేలినట్టుగా వ్యాకోచించిన నీటి కణాల సముదాయం (మేఘం) గాలిలో తేలి ఉండటమే గాక, గాలితోబాటు కొట్టుకుపోతుంది. ఋతుపవనాలు వాటిని వివిధ ప్రాంతాలకు చేర్చుతాయి. కొండలు అడ్డంవచ్చి, మేఘాలు మరింత ఎత్తుకు లేచినా, ఏ కారణం చేతనైనా మేఘాలు గల వాతావరణం అకస్మాత్తుగా చల్లబడినా, మేఘంలోని నీటి ఆవిరి నీరుగా కూడుకుని వర్షం కురుస్తుంది. ఆకస్మికంగా చల్లబడటం జరిగితే నీటి ఆవిరి వడగళ్ళ రూపం ధరిస్తుంది.

మీ ప్రాంతంలో అక్టోబరు, నవంబరు మాసాలు వర్షాకాలమైతే ప్రపంచమంతటా అలాగే ఉండదు. రాశిచక్రాన్ని మొట్టమొదట, 6, 7 వేల ఏళ్ళక్రితం నిర్ణయించిన సుమేరియనులు మకర, కుంభ, మీన రాసులను జలరాసులు చేశారు. ఎందుకంటే ఆ కాలంలో సూర్యుడు ఆ రాసులలో ఉన్నప్పుడు అక్కడ వానాకాలం.

అన్నట్టు కాళిదాసు దాదాపు 1400 ఏళ్ళక్రితం మేఘాన్ని "ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః" అని సరిగా వర్ణించాడు కాదూ?



# లబ్ధప్రణాశం

## 67

కృతఘ్నురాలి కథ

ఒకానొక నగరంలో ఒక బ్రాహ్మణుడు తన భార్యతో ఉండేవాడు. అతనికి ఆమె మీద అంతులేని ప్రేమ. కాని ఆమె నిత్యమూ అతనివాళ్ళతో జగడం పెట్టుకుని, అతనికి జీవితం దుర్భరం చేసేది. అందుచేత అతను ఉన్న ఊరు విడిచి, దూర ప్రదేశానికి వెళ్ళి, బంధువులకు ఎడంగా సుఖంగా జీవింతామనుకున్నాడు.

వాళ్ళు పోతూండగా ఇసుక ఎడారి దాటవలసి వచ్చింది. ఎండ తీవ్రంగా ఉండటం చేత భార్యకు దప్పిక అయి, నీరు కావాలని ఆక్రోశించింది. నీటి కోసం అతను చాలాదూరం వెళ్ళి, నీటితో తిరిగి వచ్చేసరికి, వడదెబ్బకు భార్య చచ్చిపోయి ఉన్నది. భార్య అంటే అమితమైన ప్రేమ కలవాడు కావటం చేత అతను గట్టిగా ఏడుస్తూ, ఆమెను బతికించమని దేవుణ్ణి వేడుకున్నాడు.

''నీ మిగిలిన జీవితంలో సగం నీ భార్యకు ధారపోశావంటే ఆమె తిరిగి బతికి అంతకాలమూ జీవిస్తుంది,'' అని ఆకాశవాణి పలికింది.

బ్రాహ్మణుడు అందుకు సంతోషంగా ఒప్పుకుని, ''నా జీవితంలో సగం ఆమెకిస్తాను,'' అన్నాడు.

అతను ఈ మాట అనగానే ఆమె బతికి లేచి భర్త తెచ్చిన నీరుతాగి, తాము వెంట తెచ్చుకున్న ఆహారం భర్తతో కలిసి తిన్నది. తరవాత వాళ్లు ప్రయాణం కొనసాగించారు.

కాలక్రమాన వాళ్ళు ఒక నగరం బయట పూలతోట చేరుకున్నారు. భర్త భార్యతో, ''నువు ఇక్కడే ఉండు. నేను




ఊళ్ళోకి వెళ్ళి, మన ఇద్దరికీ భోజనం తెస్తాను,'' అని వెళ్ళిపోయాడు.

ఒక కుంటివాడు చక్కగా పాడుతూ, అటుగా వచ్చాడు. వాడి పాటవిని ఆమె మోహపరవశురాలై, వాణ్ణి తన ప్రియుడు కమ్మనీ, లేకపోతే ఆత్మహత్య చేసుకుంటాననీ అన్నది.

''నేను కుంటివాణ్ణి. నీకు నాతో ఏమిటి ?'' అని వాడు అన్నాడు.

''అయితే అయావు !'' అన్నదామె.

కుంటివాడు ఆమె ప్రేమికుడు కావటానికి ఒప్పుకున్నాడు.

బ్రాహ్మణుడు భోజనంతో తిరిగి వచ్చి, తనతోబాటు తినమని భార్యను పిలిచాడు.

''ఈ కుంటివాడికి కూడా కొంత ఆహారం పెట్టరాదా? ఇతనికి ఆకలిగా ఉన్నది.'' అన్నది భార్య.

బ్రాహ్మణుడు ఒప్పుకున్నాడు. ముగ్గురూ భోజనం చేసిన తరవాత బ్రాహ్మణుడి భార్య, ''మనకు పిల్లలు లేరు. నువ్వు బయటికి వెళ్ళితే నేను ఒంటరిగా ఉండవలసి వస్తున్నది. నాకు ఇంట్లోపని చేసి పెట్టటానికీ ఎవరూ ఉండరు. అందుచేత ఈ కుంటివాణ్ణి మన వెంట తీసుకుపోతేనేం?'' అని భర్తతో అన్నది.

దానికి బ్రాహ్మణుడు, ''ఈ కుంటివాడు నడవలేడు. వాణ్ణి ఎవరు మోస్తారు? నా ఒళ్ళు నాకే బరువుగా ఉన్నది. మరొకణ్ణి ఎక్కడ మోసేది?'' అన్నాడు.

''ఒక తట్ట తెస్తే, ఇతన్ని అందులో కూర్చొబెట్టి నేనే మోస్తాను,'' అన్నదిభార్య.

మతిమాలిన ఆ బ్రాహ్మణుడు భార్యమీది ప్రేమకొద్దీ ఇలాటి అర్థంలేని ఏర్పాటుకు సమ్మతించి, ఒక తట్ట తెచ్చాడు; అందులో కుంటివాణ్ణి కూర్చొబెట్టి ఆమె మోసింది.

దారిలో వారికి ఒక లోతైన బావి తగిలింది. వాళ్ళు దాని బొడ్డుమీద విశ్రాంతికి కూర్చున్నారు. కుంటివాడి సహాయంతో భార్య బ్రాహ్మణ్ణి అకస్మాత్తుగా బావిలోకి నెట్టేసింది. తరవాత ఆమె కుంటివాణ్ణి

తట్టలో కూర్చోబెట్టి నెత్తికెత్తుకుని బయలు దేరింది.

వాళ్ళిద్దరూ ఒక పెద్ద నగరం చేరారు. ఆ నగరాన్ని ఒక ధర్మాత్ముడు పాలిస్తున్నాడు. అక్కడి రక్షక భటులు ఆమె నెత్తిన తట్టనూ, అందులో ఉన్న కుంటి వాణ్ణీ చూసి వింతపడి, ఆమెను తమ రాజు వద్దకు తీసుకుపోయారు.

ఆమె రాజుతో, "మహారాజా, ఇతను నా భర్త. కుంటివాణ్ణి చేసి ఇతని బంధువులు ఇతన్ని నానా బాధలూపెట్టి, చంపటానికి కూడా సిద్ధపడితే, ఒక రాత్రి ఎవరికీ తెలియకుండా నేను ఇతన్ని ఒక తట్టలో పెట్టుకుని ఈనగరానికి తెచ్చాను," అన్నది.

"నీ వంటి మహా ఇల్లాలిని నే నెన్నడూ చూడలేదు. నీకు రెండు గ్రామాలు ఈనాముగా ఇస్తున్నాను," అన్నాడు రాజు.

ఆమె ఎంతో సంతోషించి, అక్కడి నుంచి వెళ్ళిపోబోతూండగా ఆమె భర్త అక్కడికి వచ్చాడు. బావిలోపడి అతను పెట్టిన కేకలు విని, ఎవరో సన్యాసి అతన్ని రక్షించాడట.

తన భర్త వస్తూండటం చూసి బ్రాహ్మణుడి భార్య రాజుతో, "ఆ వచ్చేవాడు నా భర్తకు ప్రబలశత్రువు," అన్నది.

"అతణ్ణి చంపండి," అన్నాడు రాజు.

బ్రాహ్మణుడు రాజుతో, "మహారాజా, నన్ను చంపేముందు ఈ స్త్రీని నా బాకీ వడ్డీతోసహా తీర్చమనండి," అన్నాడు.



''అతను నీకేమిచ్చాడు ?'' అని రాజు ఆమెను అడిగాడు.

''నాకేమీ ఇయ్యలేదు,'' అన్నదామె.

''నువు ఎడారిలో చచ్చిపోయినప్పుడు నీకు నా ఆయుర్దాయంలో సగం ధారపోసి, నిన్ను బతికించుకున్నాను కానా ?'' అని బ్రాహ్మణుడు తన భార్యతో అని, రాజు కేసి తిరిగి, ''ఈమె కోసం బంధువుల నందరినీ వదులుకున్నాను, నా ఆయుర్దాయం సగం ఇచ్చాను. అందుకు బదులుగా ఈమె నా పట్ల కృతఘ్నురాలై, ఈ కుంటివాణ్ణి ప్రియుడుగా సంపాదించి, తమచేత నన్ను అన్యాయంగా చంపించాలని చూస్తున్నది,'' అన్నాడు.

రాజు కఠినంగా ప్రశ్నించిన మీదట ఆమె నిజం ఒప్పుకున్నది. అప్పుడు రాజు బలాత్కారంగా ఆమెచేత బ్రాహ్మణుడికి అతని ఆయుర్దాయం తిరిగి ఇప్పిస్తూ, ''నేను నా భర్తవద్ద అరువు పుచ్చుకున్న ఆయువును అతనికి తిరిగి ఇస్తున్నాను,'' అనిపించాడు.

ఆ మాట అంటూనే ఆమె చచ్చి పడిపోయింది.

కోతి మొసలికి కృతఘ్నురాలి కథ చెప్పి, ఇంకా ఇలా అన్నది : ''మూర్ఖుడా, అతిగా వాగే చిలకలను పంజరాలలో బంధిస్తారు, కాని మితభాషులైన కొక్కెరాయిలు స్వేచ్ఛగా తిరుగుతాయి. ఇక నువు వెళ్లు. లేకపోతే నిన్ను బలవంతాన గెంటవలసి వస్తుంది.''

దానికి మొసలి, ''నా హాస్యాన్ని అపార్థం చేసుకున్నావు. నేను విశ్వాసపాత్రుణ్ణనీ, ఎన్నడూ నీకు ద్రోహం తలపెట్టననీ నమ్మ చెబుతున్నాను,'' అన్నది.

''ఓరీ, భార్యా విధేయుడా, నీలాటివాళ్ళు భార్యలను కాదనలేక తమ క్షేమాన్నీ, ఐశ్వర్యాన్నీ, స్నేహితులనూ కూడా త్యాగం చేసేస్తారు. నందుడూ, వరరుచీ లాటి వాళ్లే భార్యలకు దాసులైతే నువు ఒక లెక్కా ?'' అన్నది కోతి.

మొసలి ఆ కథ వినగోరితే కోతి చెప్పింది.





# భల్లూకమాంత్రికుడు

## 7

[అరణ్యంలో నాగమల్లు అనే దొంగలనాయకుడికి దొరికిన రాజు దుర్ముఖుడు, తన పేరు దుర్జయశెట్టి అని చెప్పి పారిపోజూశాడు. నాగమల్లు నమ్మక అతణ్ణి ఒక గుహలోకి తీసుకుపోయాడు. అక్కడికి తలారిభల్లూకం వచ్చి గొడవ చేస్తూండగా, ఉగ్రదండు డనే రాక్షసుడు వచ్చాడు. తలారిభల్లూకం, వాడి మీదికి గండ్రగొడ్డలి ఎత్తింది. తరవాత—]

తలారిభల్లూకం సూర్యకాంతిలో ధగధగ లాడుతున్న గండ్రగొడ్డలిని పైకెత్తి పట్టుకుని తన కేసి రావటం చూస్తూనే, రాక్షసుడు ఉగ్రదండుడు ఒక్కక్షణం ఆశ్చర్యపోయి, అంతలోనే ఏదో గుర్తుకు రావటంతో నిలువెల్లా వణికిపోతూ, రాతి గదను ముందుకు చాచి, ''ఒరే, మానవ భల్లూకాధమా! అగు, ఏమా పొగరు?'' అన్నాడు.

తలారి భల్లూకం చప్పున ఉన్నచోటునే అగి, ఉగ్రదండుణ్ణి నిలువెల్లా ఒకసారి పరీక్షగా చూసి, ''ఒరే, ఉగ్రదండా! రాక్షసుణ్ణని అహం పోతున్నావా? నీ మేక పోతు గాంభీర్యం, నా దగ్గిరా? నీ కాళ్లూ, గద పట్టిన చేయీ వణుకుతూండటం, తెలుస్తూనే వున్నది,'' అన్నాడు.

ఉగ్రదండుడు పళ్ళు కొరుకుతూ కాళ్ళతో గట్టిగా నేలను తాటించి,



'' నా కాళ్ళూ, చేతులూ వణుకుతున్న మాట నిటమే. కాని, అది నిన్ను చూసిన భయం వల్ల కాదు; అసహ్యం వల్ల! ఇంతకూ నీలో భల్లూకం పాలెంత? మనిషి పాలెంత ? ఏమిటీ, యీ సంకరరూపం!" అన్నాడు.

ఆ మాటలతో ఉగ్రుడైపోయిన తలారి భల్లూకం, కోపం పట్టలేక గండ్రగొడ్డలిని దాపులనున్న పెద్ద రాతిమీద బలంగా కొట్టి, '' ఒరే, రాకసాధమా! భల్లూక మాంత్రికుడు సృష్టించిన, యీ తలారి భల్లూకుణ్ణే హేళనచేసి మాట్లాడుతున్నావా? ఇదిగో, నీ తల తెగి నేల పడబోతున్నది,'' అంటూ కుప్పించి ముందుకు దూకి, గండ్రగొడ్డలిని రాక్షసుడి కంఠం కేసి కొట్టబోయాడు.

ఉగ్రదండుడు ఎగిరి గంతేసి దాపుల నున్న ఒక చిన్న దేవదారువృక్షం పక్కకు పోయి నిలబడి, యీ సారి నిబ్బరంగా అడుగులో అడుగు వేసుకుంటూ తనను సమీపిస్తున్న తలారి భల్లూకంతో, "తలారి భల్లూకా, కాస్త శాంతించు. మనిద్దరం ఒకళ్ళనొకళ్ళం చంపుకునే ప్రయత్నంలో బాగా గాయపడటం తటస్థిస్తే, లాభపడేది ఎవరో తెలుసా? '' అన్నాడు.

ఆ ప్రశ్న వింటూనే తలారి భల్లూకుడికి, తానా ప్రాంతాలకు వచ్చిన పనేమిటో గుర్తుకు వచ్చింది. భల్లూక మాంత్రికుడు తనను పంపింది, దుష్టుడైన ఉదయగిరి రాజు దుర్ముఖుడి తల నరకమని! ఆ పని ముగించుకుని, తిరిగి భల్లూకమాంత్రికుడి దగ్గిరకు పోక, తనెందుకు యీ ఉగ్ర దండుడనే రాక్షసుడితో గొడవలు పడటం? వాడు కవ్వించినందుకు, తను గండ్ర గొడ్డలితో మీదికి దూకితే, దూరంగా పారి పోయాడు. అంటే, తనే గెలిచినట్టన్న మాట!

ఈ ఆలోచన కలగ్గానే తలారి భల్లూకం, వేళ్ళతో గండ్రగొడ్డలి పదునును ఒకసారి పరీక్షించి చూసుకుని, "ఒరే, ఉగ్రదండా! సమయానికి నేనిక్కడికొచ్చిన పనేమిటో

గుర్తు చేశావు. మెచ్చాను! ఇక నీ దారిన నువ్వుపో: నే నీ పక్కన వున్న గుహలో దాగిన రాజు దుర్ముఖుడి తల నరికి, నా దారిన నేను పోతాను,'' అంటూ వెనుదిరిగాడు.

ఉగ్రదండుడు రెండడుగులు ముందుకు వేసి, ''ఓయ్, తలారి భల్లూకా, కొంచెం అగు! ఇంతకుముందు నువ్వు, భల్లూకమాంత్రికుడి పేరు పలికావు. నే విన్న భల్లూకమాంత్రికుడూ, నువ్వనే యీ భల్లూకమాంత్రికుడూ ఒకరే నేమో అన్న సంశయం కలుగుతున్నది. నువ్వెరిగిన యీ మాంత్రికుడి వయసు ఏపాటి వుంటుంది ?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు తలారి భల్లూకుడు పెద్దగా నవ్వి, ''సూర్య, చంద్రుల వయసెంతో ఆయన వయసంత. ఆయన కళ్ళ ఎదటే హిమాలయ పర్వతాలు పుట్టి: యింత అయినై. బ్రహ్మపుత్రానది పురిటిబిడ్డగా కెవ్వు మంటూ అరిచి, వేలెడంత నీటి పాయగా కొండరాళ్ళ మీద గంతులు వేయటం అయనెరుగు!'' అన్నాడు.

''భళిరా, తలారిభల్లూకా! నీ చేతిలోని గండ్రగొడ్డలి ఎంత వాడి అయిందో, నీ తలలోని నాలుకా అంత వాడి అయిందే! నిజంగా మెచ్చాను! నేనూ, నీ వెంట వచ్చి, ఆ భల్లూకమాంత్రికుడి దర్శనం



చేసుకోవటం ఎలా వుంటుందంటావు ?'' అన్నాడు ఉగ్రదండుడు రాతి గదను దూరంగా విసిరివేస్తూ.

రాక్షసుడి ప్రవర్తనకు తలారిభల్లూకం ఆశ్చర్యపోతూ, ''అలా రాతి గదను దూరంగా పారవేయటంలో ఏదైనా విశేష ముందంటావా ?'' అని అడిగాడు.

''ఎందుకు లేదు ? ఈ క్షణంనుంచీ మనిద్దరం మిత్రులం,'' అన్నాడు ఉగ్రదండుడు.

ఆ జవాబుకు తలారిభల్లూకం పొట్ట చెక్కలయేలా నవ్వి, ''భల్లూకమాంత్రికుడి చేతగల, ఎలుగుతలాటం మంత్రదండం తగిలి, నా రూపం మారినా, చూచాయగా



13976



తప్పదు, ఇప్పుడు ఏం చేసేట్టు?'' అన్నాడు వణికిపోతూ.

నాగమల్లు, దుర్ముఖుడి కేసి చూశాడు. దుర్ముఖుడు, తనలో తాను ఏదో గొణుక్కుంటూ గుహద్వారం కేసి చూస్తున్నాడు. నాగమల్లు తన అనుచరులిద్దరినీ కత్తులు దూసి, సిద్ధంగా వుండమని హెచ్చరించి, దుర్ముఖుడితో, ''నీ అంగరక్షకుడి మాటల వల్ల యిప్పటికి నువ్వు శెట్టివి కాదనీ, రాజువనీ నాకు నమ్మకం కలిగింది. ఆ భల్లూకం నరకవచ్చింది, నీ తల. ఆత్మ రక్షణ చేసుకునే ప్రయత్నం చెయ్యక, ఏదో గొణుగుతున్నా వెందుకు?'' అన్నాడు కోపంగా.

''నేను గొణగటం లేదు, ఏమి చెయ్యాలో తెలుసుకునేందుకు, ఇష్ట దైవాన్ని ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు రాజు దుర్ముఖుడు బొంగురుపోయిన గొంతుతో.

''అంటే, యీనాటివరకూ నువ్వుచేసిన వెధవ పనులన్నీ, నీ యిష్టదైవం అనుమతితోనే చేశావన్నమాట! ఛీ, బయిటికి నడు,'' అంటూ నాగమల్లు, దుర్ముఖుణ్ణి పక్కకు తోసి, సగం తెరుచుకున్న గుహ ద్వారం దగ్గిరకుపోయి, పెద్ద గొంతుతో, ''ఓయ్‌ః, తలారిభల్లూకా, కాస్త నిదానించు! ఈ గుహలోవున్న వాళ్ళలో నీ కాక్కవలసింది, దుర్ముఖశెట్టి నని

నేనెవరో, నా కింకా గుర్తున్నది. రాజు దుర్ముఖుడి తలను ఆ మాంత్రికుడి పరం చేసిన మరుక్షణం, ఆయన నన్ను తలారిగా మార్చేస్తాడు. కనక, మనిద్దరి మధ్యా స్నేహం సాగదు. నీ గుహ దారేదో నువు చూసుకో,'' అని, దొంగల నాయకుడూ, రాజు దుర్ముఖుడూ దాగి వున్న గుహకేసి వెళ్ళాడు.

ఈసారి తలారిభల్లూకం గుహకు అడ్డంగావున్న రాతిని పక్కకు లాగి పడవేసే ప్రయత్నం ప్రారంభించగానే లోపలవున్న రాజు అంగరక్షకుడు, దొంగ నాగమల్లుతో, ''నాగమల్లూ, ఈసారి మహారాజుగారితోపాటు మనందరికీ చావు

అబద్ధాలాడే దుర్ముఖరాజే గదా ?'' అని అడిగాడు.

''ఔనౌను! మిగతా చిల్లరమల్లర సరుకుతో నాకేం పని? వాణ్ణి గుహనుంచి తలతోపాటు బయటికి నెట్టండి; తల మాత్రం నే న్నరుక్కుపోతాను,'' అన్నాడు తలారిభల్లూకం.

''అయితే కొంచెం ఓపికపట్టు,'' అని, దొంగలనాయకుడు నాగమల్లు వెనుదిరిగి, దుర్ముఖుడితో, ''రాజా, దుర్ముఖా! తలారిభల్లూకం మాటలువిన్నావు గదా? చావే తప్పకపోతే, రాజోచితంగా కత్తి దూసి, ఆ తలారి భల్లూకంతో పోరాడుతూ ఎందుకు చావకూడదు ?'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు వెలవెలపోతూ, ''నేను రాజోచితంగా బతకటం నేర్చిన వాణ్ణేకాని, రాజోచితంగా చావటం చేత నైన వాణ్ణికాను!'' అని, పక్కనవున్న అంగరక్షకుడితో, ''ఒరే, అంగరక్షకా! నీ స్వామిభక్తి ఎలాంటిదో చూపి, స్వర్గానికి పోయేందుకు, యిదే మంచి అవకాశం! నువు ముందుపోయి ఆ తలారిభల్లూకాన్ని ఎదిరించు. ఆ సమయంలో నేను ప్రాణాలతో తప్పించుకునే అవకాశం వుంటుందేమో చూస్తాను,'' అన్నాడు.

అంగరక్షకుడు యీసారి ఒర నుంచి దూసిన కత్తిని తిరిగి ఒరలో పెట్టివేస్తూ,



''నేను చచ్చి స్వర్గానికిపోతే, యిక్కడ నా భార్యాబిడ్డల మాటేమిటి? ఇప్పు డప్పుడే అటుకేసిపోవాలని లేదు,'' అంటూ గుహ గోడకు చేరగిలబడి, గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

అంతలో బయటి నుంచి తలారి భల్లూకం కోపంతో పళ్ళుకొరికి, ''ఒరే, ఎక్కడరా, ఆ దుర్ముఖ రాజు? ఒకసారి నేను గుహలోజొరబడ్డానంటే, మీ అందర్నీ ఊచకోత కోస్తాను,'' అన్నది.

దొంగ నాగమల్లు తన అనుచరులిద్దరికీ సైగచేసి, వాళ్ళు వెంటరాగా, గుహకు అడ్డంగావున్న రాయిని పక్కకునెడుతూ, తల బయటికి పెట్టి, ''అయ్యా, నన్నూ,



నా యిద్దరు సేవకుల్నీ ప్రాణాలతో వదలండి. మేం, యీ ప్రాంతాల అరణ్య మృగాల మధ్య దినదిన గండంగా బతుకుతున్నవాళ్ళం!'' అన్నాడు.

''ఒరే, మీరు దొంగలు, ఆ సంగతి నాకు తెలుసు! అయినా నేను, మిమ్మల్ని ఏమీ చెయ్యను,'' అన్నాడు తలారిభల్లూకుడు.

నాగమల్లూ, అతడి అనుచరులూ రాతిన సొంతం పక్కకు నెట్టివేసి బయిటికి వస్తున్నంతలో, వాళ్ళను చాటు చేసుకుని రాజు దుర్ముఖుడు వేగంగా బయిటికి దూకి, పారిపోసాగాడు.

తలారిభల్లూకం ఎగిరి గంతేసి, ''ఒరే, దుర్ముఖా! ఆగు, ఆగు,'' అంటూ వెంటబడి కొంత దూరం పరిగెత్తేంతలో దుర్ముఖుడు ఒక చెట్టుచాటుకు పరిగెత్తబోయి, ఎదురుగా రాతిగద పట్టుకుని నిలబడివున్న రాక్షసుడు ఉగ్రదండుణ్ణి చూసి, ఒక చావుకేక పెట్టి, అతడి ముందు బోర్లాపడిపోయాడు.

తలారిభల్లూకుడు, ''ఆహాఁ, దొరికావు గదరా!'' అంటూ దుర్ముఖుణ్ణి సమీపిస్తున్నంతలో, ఉగ్రదండుడు రాతిగదను నేలజార్చి, చేఎత్తి, ''సోదరా, తలారి భల్లూకా, ఒక్కక్షణం ఆగు! ఆ భల్లూక మాంత్రికుడు నిన్ను బతికివున్న రాజు దుర్ముఖుడి తల నరుక్కురమ్మన్నాడా లేక చచ్చిన దుర్ముఖుడి తల కోసుకు రమ్మన్నాడా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు తలారిభల్లూకం ఆశ్చర్యపోతూ, కదలా మెదలక పడివున్న దుర్ముఖుడి కేసి పరీక్షగా చూసి, ''ఉగ్రదండా! ఈ దుర్ముఖుడు చచ్చిపోయాడనా నువ్వనేది?'' అన్నది.

''చావలేదు, మూర్ఛపోయాడు. మూర్ఛలోవున్నవాడి తల నరకటం మహాపాపం అన్నారు గదా, పెద్దలు. ఒక పని చెయ్యి. వీణ్ణి, ఆ మాంత్రికుడి దగ్గిరికి తీసుకుపోయి, అక్కడే తల నరుకు. అక్కడకు వెళ్ళేలోపల వీడికి స్పృహ రాకపోదు,'' అన్నాడు ఉగ్రదండుడు.

తలారిభల్లూకం బుసలుకొడుతున్నట్టు పెద్దగా నిట్టూర్చి, "శత్రువును భుజాన వేసుకుని మోయమన్నావా? ఛీ, ఛీ!" అన్నాడు.

ఉగ్రదండుడు గుహకేసి ఓ మారు చూశాడు. అక్కడ నాగమల్లూ, అతడి యిద్దరు అనుచరులూ నిలబడి, పారి పోయే ప్రయత్నం చేస్తూ గుసగుస లాడు తున్నారు. ఉగ్రదండుడు రాతిగదను చేతికి తీసుకుని, "ఒరే, దారిదోపిడీ వెధవల్లారా, పారిపోవాలని చూస్తున్నారా? జాగ్రత్త, కాలరాయగలను! ఇటురండి. ఆ అంగరక్షకు డెక్కడ?" అంటూ గద్దించాడు.

దొంగలు ముగ్గురూ గడగడ వణికి పోయారు. నాగమల్లు గుహలోకి తొంగి చూసి, "అయ్యో, ఇక్కడ ఆ రాజు అంగరక్షకుడు మూర్ఛపోయినట్టున్నది. గుహకు చేరగిలబడి, కట్టెలా బిగుసుకు పోయి వున్నాడు," అన్నాడు.

"వాడిది దొంగమూర్ఛ. ఉగ్రదండుడు అభయంయిచ్చి, పిలుస్తున్నట్టు చెప్పండి. ఇక్కడ రాజుదుర్ముఖుడు చావబోతు న్నాడు," అన్నాడు ఉగ్రదండుడు.

దొంగల నాయకుడు నాగమల్లు పెద్దగా గొంతెత్తి, "ఒరే, అంగరక్షకా, మూర్ఛలే! మహారాక్షసుడు ఉగ్రదండుడు, నిన్ను



చంపనని అభయం యిచ్చాడు," అని కేకపెట్టాడు.

దానితో అంగరక్షకుడు చప్పున లేచి కూర్చుని, మోకాళ్ళ మీద పాకుతూ గుహలోనుంచి బయిటికి వస్తూ, "మహా రాజుగారి తల తెగినట్టేనా? ఆ భయంకర తలారిభల్లూకం యిక్కణ్ణించి వెళ్ళి పోయిందా?" అని అడిగాడు.

ఆ వెంటనే నాగమల్లు అనుచరు లిద్దరూ, వాడి మీదికి దూకి, ఒకడు మెడా, మరొకడు నడుమూ పట్టుకుని బయిటికిలాగి, "ఆట్టే వాగకు! అడుగో, మీ దుర్ముఖరాజు, ఉగ్రదండుడి పాదాల దగ్గిర మూర్ఛపోయి వున్నాడు," అన్నారు.

అంగరక్షకుడు నిలువెల్లా వణికి పోతూ ఉగ్రదండుడి ముందుకు పోయి, "అయ్యా, యీ క్షణం నుంచీ నేను తమకు అంగరక్షకుణ్ణి. ఈ తలారి భల్లూకం నుంచి కాపాడాలి," అన్నాడు.

ఉగ్రదండుడు పెద్దగా నవ్వి, "అలా అయితే, నా రక్షణకు, ఒక అంగరక్షకుడు దొరికాడన్న మాట! ఎంత మహా రాక్షసుడికి ఎంత దుర్దశపట్టింది," అని, "ఒరే, అంగరక్షకా! వెంటనే ఆ కనబడే నా గుహలోకిపోయి, ఒక రాతి పాత్ర తీసుకుని, ఆ చెట్లచాటునవున్న నీటివాగు నుంచి, నీరు తీసుకురా. ఈ దుర్ముఖ రాజు మూర్ఛనుంచి లేచేమార్గం ఏమన్నా వున్నదేమో చూద్దాం," అన్నాడు.

"మా రాజు మూర్ఛనుంచి బయట పడితే తప్ప, తలారిభల్లూక దొర, తల నరుక్కుపోరన్నమాట!" అంటూ ఆశ్చర్య పోయాడు అంగరక్షకుడు.

తలారిభల్లూకం గండ్రగొడ్డలి ఎత్తి, కళ్ళెర్రచేసి, "ఒరే, మూర్ఖుడా! అలా చూస్తావేం? ఉగ్రదండుడు చెప్పిం దేమిటి?" అన్నాడు.

ఆ మరుక్షణం అంగరక్షకుడు రాక్షసుడి గుహలోకి పరిగెత్తి, అక్కడ వున్న ఒక రాతిపాత్ర తీసుకుని, వాగు కేసి పోయాడు. వాడు పాత్రలో నీటిని నింపు తున్నంతలో, ఆ పక్కనవున్న చెట్లగుంపులో నిలబడివున్న తొండంతెగిన ఏనుగు వాణ్ణి చూసి, పెద్దగా ఘీంకరించి వాడికేసి పరిగెత్తి రాసాగింది.

అంగరక్షకుడు పాత్రను అక్కడేవదిలి, ఉగ్రదండుడూ వాళ్ళువున్న చోటుకు పరి గెత్తుకుంటూ వచ్చి, "అయ్యా, తలారి భల్లూకంగారి మొండి తొండపుటేనుగు వెంటబడి వస్తున్నది," అంటూ అరిచాడు.

"ఆహాఁ, నా వాహనం యీ ప్రాంతాలనే వున్నదన్నమాట!" అంటూ తలారి భల్లూకుడు తలపక్కకుతిప్పి చూసేంతలో, ఏనుగు తొండం పైకెత్తి, ఘీంకరిస్తూ పెనుభూతంలా వాళ్ళ మీదికివచ్చి పడ సాగింది. —(ఇంకావుంది)






## అరణ్యాకుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు రాజకీయాలు వదిలేసి ఆటవిక పరిశ్రమలో పడితే, వెనకటికి అరణ్యాకుడు అనే ఆటవికుడు రాజకీయాలలో పడ్డాడు. శ్రమతెలియకుండా నీకు అతని కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

చంద్రగిరి రాజు అమరపాలు డంటే ఎంతలేసి రాజులకూ సింహస్వప్నం. అతనితో యుద్ధంచేసి ఓడని రాజులు లేరు. అతను అలా అజేయుడుగా నిలబడటానికి కారణం సేనలోని ఆటవికదళాలు.

ఈ ఆటవికుల కుదురు చంద్రగిరి రాజ్యంలోని కీకారణ్యాలు. అక్కడ

## బేతాళ కథలు



కుల నాయకుడి కొడుకు అరణ్యకుడు తమ జాతికి తీరని ద్రోహం జరుగుతున్న దని శంకించసాగాడు. ప్రతిఏడూ అమర పాలుడి మనుషులు వచ్చి అటవీ సంపదనూ, సేనలో చేరటానికి ఆటవిక యువకులనూ కప్పంలాగా పట్టుకు పోతారు!

అతను తండ్రితో ఒకసారి వాదన వేసుకున్నాడు: "మనం రాజుకు కప్పం ఎందుకు కట్టుతున్నాం? ఆయన మనని ఎప్పుడు జయించాడు? మన సంపదనూ, మన యువకులనూ కొల్లగొట్టి, మనను దరిద్రులుగానూ, బలహీనులుగానూ ఉంచే అధికారం రాజుకు ఎలా వచ్చింది?"

అరణ్యకుడి తండ్రి నవ్వి, "రాజు వద్ద ఉన్న ఆటవిక దళాలు మనవికావా? రాజు బలం మన బలం కాదా? రాజు మనవాడుగా ఉండగా మనకేసి ఎవరన్నా కన్నెత్తి చూడగలరా?" అన్నాడు.

"నువు పొరబడ్డావు. రాజు బలం మనబలం కాదు. మన బలమే రాజు బలం. మన దళాలు లేకపోతే రాజు ఇన్ని దేశాలు జయించగలుగునా? నువ్వూ, నేనూ స్వతంత్రులంకాదు. సామంతులం. రాజు మనుషులు వచ్చి కప్పం అడిగి నప్పుడు మనం ఇయ్యక నిరాకరిస్తే,

ఆటవికుల స్థావరాలు ఉండేవి. వారికి ఒక నాయకుడు ఉండేవాడు. చంద్రగిరిరాజ్యం కోసం అతనూ, అతని ప్రజలూ ఏంచెయ్యమన్నా చేశారు. అమరపాలుడితో ఆటవిక నాయకుడు చాలా అన్యోన్యంగా ఉంటూ, అతనికి ఏటా అటవీ సంపదతోబాటు మెరికల లాంటి యువకులను సైనికులుగాకూడా పంపేవాడు. వారితోనే అమరపాలుడు తన ఆటవిక సైనికదళాలను నిర్మించు కుని, దాపుల ఉన్న ఒక్కొక్క రాజ్యాన్నీ పాదాక్రాంతం చేసుకుని, ఆ రాజుల నుంచి కప్పం పుచ్చుకుంటూ వచ్చాడు.

ఇలా కొంతకాలం జరిగినాక ఆటవి

అప్పుడుగాని నీకు నిజం తెలియదు!'' అన్నాడు అరణ్యకుడు.

ఆటవిక నాయకుడు చాలాసేపు ఆలోచించుకుని, ఆటవికుల సభలో, తాను నాయకత్వం వదులుకుంటున్నాననీ, ఇకనుంచీ అరణ్యకుడు నాయకుడౌతాడనీ, అందరూ అతని ఆజ్ఞలు పాటించవలసి ఉంటుందనీ ప్రకటించాడు.

తరవాత కొద్దిరోజులకే రాజు మనుషులు వచ్చి, ఏటా రాజుకు పంపే వెదురుబియ్యమూ, చందనపుచెక్కలూ, పులిచర్మాలూ, ఏనుగులూ, పాతికమంది యువకులూ తీసుకుపోతామన్నారు.

అరణ్యకుడు వాళ్ళతో ఇలా స్పష్టంగా చెప్పాడు: ''మేం మీకు కప్పం కట్టవలసిన అవసరంలేదు. చంద్రగిరి రాజ్యం మీది అయినట్టే మాదీనూ. మేం స్వతంత్ర జీవులం. కాని మా యువకులందరూ మీ సైన్యంలో చేరిఉన్న కారణంచేత చాలా దుర్బలులమై, ఆత్మరక్షణకూడా చేసుకోలేని స్థితికి వచ్చాం. ఇంకమీదట ఈ ఏర్పాటు సాగదు. మా ఆటవిక దళాలను మాకు తిప్పిపంపమని రాజుగారికి చెప్పండి. అటవీ సంపద ఆటవికులది. రాజుగారికి దారిద్ర్యం సంప్రాప్తమైతే మా సంపదమీద ఆధారపడవచ్చు.



అలాగే రాజ్యానికి శత్రుభయం కలిగిన నాడు, మా సైనికదళాలు దేశరక్షణకు పోరాడతాయి. ఈ విషయం నేను రాజుగారికి హామీ ఇస్తున్నాను.''

రాజుగారి మనుషులు వెళ్ళిన మర్నాడు రాజుగారి నుంచి అరణ్యకుడికి ఇలా తాఖీదు వచ్చింది: ''ఆటవికులు స్వతంత్రులుకారు. అమరపాలుడి ఏలుబడిలో ఉన్నవాళ్లు. ఆనవాయితీ ప్రకారం అటవీసంపద రెండురోజులలో చేరనిపక్షంలో, సేనలో ఉన్న ఆటవికదళాల వాళ్ళను ఖైదులోపెట్టి, తిండిపెట్టక మాడ్చిచంపటం జరుగుతుంది. ఆటవికుల స్థావరాలు నేలమట్ట మవుతాయి.''



యుద్ధంతో ఆటవికులు మట్టుబెట్టారు. చాలామంది బందీలుగా చిక్కారు.

''యుద్ధానికి ఆటవిక దళాలు రాలేదేం?'' అని అరణ్యకుడు అడిగితే, పట్టుబడిన సైనికులు, ''వాళ్లంతా ఖైదులో ఉన్నారు,'' అనిచెప్పారు.

రాజుగారి తాఖీదు విన్నప్పుడు కలిగిన అనుమానం అరణ్యకుడిలో మరింత బలపడింది. అతను కర్తవ్యం ఏమిటా అని ఆలోచిస్తుండగా అనుకోని సంఘటన ఒకటి అతనికి తోడ్పడింది.

కొందరు దొంగలు కీకారణ్యంలోకి ఒక మేనాతో సహా పోతూ ఆటవికుల కంటపడ్డారు. దొంగలకూ, ఆటవికులకూ పోరాటం జరిగి, దొంగలంతా పట్టుబడ్డారు. మేనాలో ఉన్నది రాజకుమార్తె! దొంగలు నిజంగా దొంగలుకారు; అరణ్యకుడు చిత్రవధచేస్తానని భయపెడితే నిజం బయటపెట్టారు. రాజుగారి ఏక సంతానమైన కుమార్తెను అరణ్యంలోకి తీసుకుపోయి చంపమని మంత్రి వారిని నియోగించాడట!

అరణ్యకుడికి ఒక్కసారిగా జ్ఞానోదయమయింది. అతని అనుమానం రూఢి అయిపోయింది. అతను మంత్రి పంపినవారితో, ''రాజకుమార్తె సంగతి చూసుకునే బాధ్యత నాది. ఆమె ఇక

ఇది విని అరణ్యకుడికి ఆశ్చర్యం కలిగింది. అతను రాజదూతలతో, ''మేం రాజుగారి సామంతులంకాము.మమ్మల్ని రాజుగారు గెలిచినమీదట ఎవరి కెవరు సామంతులో తేలిపోతుంది. కప్పం కట్టేదిలేదు,'' అని చెప్పాడు.

అతను ఒకవిధంగా అంచనావేసి, యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఆ అంచనా ఏమిటంటే, రాజు తమ గూడెంమీదికి తమ ఆటవికదళాలను పంపితే వాళ్ళను తిరిగిపోకుండా చూసుకుందామని!

కాని అలా జరగలేదు. గూడెంమీదికి వచ్చిన సైనికులలో ఆటవికుడు ఒక్కడూలేడు. ఈ సైనికులను ప్రచ్ఛన్న

మా గూడెంమనిషే అనుకోండి. పోతే, మీరు నాకు శుభవార్త తెచ్చారు గనుక మిమ్మల్ని విడిచిపుచ్చుతాను. నాదీ మంత్రి గారిదీ ఒకే ఆశయం. ఆయనను సింహాసనంమీద కూర్చోబెట్టటానికి నేను సిద్ధమే. నాతో సంప్రదించటానికి ఆయనను ఒక్కసారి రమ్మనండి. మా మధ్య ఒప్పందం జరగటం ఆయనకూ, నాకూ కూడా లాభం,'' అన్నాడు.

ఈ మాట తెలుస్తూనే మంత్రి అరణ్యకుణ్ణి చూడవచ్చాడు. అరణ్యకుడు మంత్రిని చంపేసి, రాజకుమార్తెను వెంటబెట్టుకుని రాజును చూడబోయాడు. రాజకుమార్తె అపహరణమూ, మంత్రి చావూ గురించి విని రాజు ఎంతో నొచ్చుకుని, ''మీ ఆటవికులు నాకు ఎన్నో విజయాలు చేకూర్చిపెట్టారు. అవన్నీ ఒక ఎత్తూ, నువు నన్ను ఒంటరిగా పెద్ద కుట్రనుంచి కాపాడటం ఒక ఎత్తూనూ. మంత్రి ఏమి చేస్తున్నదీ నేను సరిగా గమనించక పరిస్థితి విషమించనిచ్చాను. మీ ఆటవికులు నాకు సామంతులని నేనెన్నడూ అనలేదు. నీ తండ్రి నా పైగల ప్రేమకొద్దీ మీ సంపదనూ, యువకులనూ నా వశం చేస్తూ వచ్చాడు. దాన్ని నువు వ్యతిరేకించావంటే అది నీ తప్పుకాదు. మీ ఆటవిక సైనికులను మంత్రి చెరలో



పెట్టించటంకూడా నాకు తెలియకుండానే జరిగింది. వారిని తీసుకుపో,'' అన్నాడు.

''లేదు, మహారాజా. వాళ్లను మీ వద్దనేఉండనియ్యండి'', అని అరణ్యకుడు రాజు వద్ద శలవు పుచ్చుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, అమరపాలుడు పంపిన తాఖీదు విని అరణ్యకుడికి కలిగిన అనుమానమేమిటి? తమ గూడెంమీద దాడి జరిగినమీదట అది ఎందుకు బలపడింది? రాజకుమార్తె ఉదంతంతో అది ఎలా రూఢీఅయింది? తనలాగే మంత్రికూడా రాజు పతనం కోరుతున్న సంగతి ఎలా తెలిసింది అతనికి? తెలిసినవాడు మంత్రిని పిలిపించి

ఎందుకు చంపాడు? అంతా అయ్యినాక అరణ్యకుడు తండ్రినాటి అనవాయితీని పూర్తిగా ఎందుకు ఆమోదించాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తన తండ్రి రాజు పట్ల స్నేహంతోగాక దాస్యబుద్ధితో ప్రవర్తించాడనుకోవటంలో కొంతవరకు అరణ్యకుడు పొరపాటు పడ్డాడు. కాని ఆ పొరపాటుకు కారణం లేకపోలేదు. రాజు మనుషులు కప్పంలాగా పట్టుకుపోతున్నది అతను సహించలేక, తాను నాయకుడు కాగానే దాన్ని నిరాకరించాడు. రాజు ఏంచేస్తాడో దాన్నిబట్టి తండ్రి వైఖరి నిజమో కాదో తెలుసుకుందామని అతని ఉద్దేశం కావచ్చు. కాని, రాజుగారు ఈ కప్పంకోసం ఆటవిక దళాలను ఖైదులోపెట్టి, తిండికి మాడ్చి చంపుతానంటాడని అతను కలలోకూడా ఊహించలేదు. ఎందుకంటే ఆ దళాలను చంపుకోటంకన్న రాజుకు ఆత్మహత్య ఉండదు. అందుచేత అది రాజు పంపిన సందేశమేనా అని అతనికి సందేహం కలిగింది. ఆటవిక సైనికులు చెరలో ఉన్నారని మంత్రి పంపిన మనుషులు చెప్పినాక ఇది మంత్రి ఆలోచనేననీ, అతను రాజును నాశనం చెయ్యటానికి ఎత్తువేస్తున్నాడనీ అరణ్యకుడు స్పష్టంగా గ్రహించాడు. తన సందేశం విని ఎప్పుడైతే మంత్రి వచ్చాడో, అప్పుడే అతను రాజద్రోహి అని తేలిపోయింది. తరవాత అరణ్యకుడు మంత్రిని చంపి, రాజునూ, తమ సైనికులనూ రక్షించుకుని, తన తండ్రి అమలుజరిపిన అనవాయితీ ఆమోదించటంతప్ప ఇంక చెయ్యదగినది ఏమీలేదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అగస్త్యుడు

అనేకమంది పురాణవ్యక్తులు కుండలలో పుట్టినట్టు చెబుతారు. వారిలో వసిష్ఠుడూ, అగస్త్యుడూ ఉన్నారు.

అగస్త్యుడు చాలాకాలం పెళ్లి చేసుకో లేదు. ఆయన ఒకసారి అరణ్యంలో తిరుగుతూంటే, కొందరు వ్యక్తులు తలకిందుగా వేళ్ళాడుతూ కనిపించారు.

"మీరు ఇలా ఉన్నారేం?" అని అగస్త్యుడు వారిని అడిగాడు.

"మా వంశంలో అగస్త్యుడు అనేవాడు పిల్లలు కనకపోవటంచేత మాకు సద్గతులు లేక, ఇలా ఉన్నాం," అన్నారు వారు.

వాళ్ళు తన పూర్వులని గ్రహించి, అగస్త్యుడు పెళ్ళాడి వారిని ఉద్ధరించ గోరి, విదర్భరాజు వద్దకు వెళ్లి, అతని కూతురైన లోపాముద్రను తనకిచ్చి పెళ్లి చెయ్యమన్నాడు. కందమూలాలు తినే వాడికి తన కూతురినియ్యటానికి రాజు సందేహించాడు. కాని లోపాముద్ర అగస్త్యుణ్ణి పెళ్ళాడటానికి సిద్ధపడింది.

వివాహం అయిన అనంతరం లోపాముద్ర అగస్త్యుడితో తనకు మంచిబట్టలూ, నగలూ కావాలన్నది. డబ్బుకోసం అగస్త్యుడు శ్రుతపర్వు డనే రాజు వద్దకు వెళ్ళాడు. శ్రుతపర్వుడి దగ్గిర డబ్బు లేదు. ఇద్దరూ కలిసి బ్రధ్నశ్వుడు అనే రాజు వద్దకు వెళ్ళారు. అతని వద్దా అదనంగా డబ్బు లేదు. ఇల్వలు డనేవాడి దగ్గిర పుష్కలంగా డబ్బున్నదని వారు ఇల్వలుడి వద్దకు వెళ్లారు..

ఈ ఇల్వలుడు వాతాపి అనేవాణ్ణి మేకగా మార్చి, వండి, అతిథులుగా వచ్చిన బ్రాహ్మణులకు పెట్టేవాడు. తరవాత వాతాపి ఆ బ్రాహ్మణుల పొట్టలు చీల్చుకుని బయటికి వచ్చేవాడు. ఇలా వాళ్లు బ్రాహ్మణులను చంపుతూండేవారు.

ఇల్వలుడు తన వద్దకు వచ్చిన ఇద్దరు రాజులకూ, అగస్త్యుడికీ చక్కగా భోజనం పెట్టాడు. వాతాపి, ఇల్వలుల సంగతి తెలిసిన అగస్త్యుడు భోజనం చేసి, "జీర్ణం, జీర్ణం! వాతాపి జీర్ణం!'' అన్నాడు. వాతాపి జీర్ణమైపోయాడు.

ఈ సంగతి గ్రహించిన ఇల్వలుడు పైకి ఏమీ తెలియనియ్యక, డబ్బు ఇచ్చి పంపేశాడు.

కావేరి కూడా అగస్త్యుడి భార్యే అని చెబుతారు. ఒకసారి బ్రహ్మ అగస్త్యుడి వద్దకు వచ్చి, కవేరుడు అనే రాజర్షి కూతురు కావేరి శివుణ్ణి గూర్చి తపస్సు చేస్తున్నదనీ, ఆమెను పెళ్ళాడవలసిందనీ అన్నాడు. అగస్త్యుడు అందుకు ఒప్పుకుని, ఆమెను తన కమండలంలో దాచుకున్నాడు.

తరవాత అగస్త్యుడు వింధ్యపర్వతాన్ని శిక్షించటానికి బయలుదేరుతూ, తన కమండలాన్ని శిష్యులపరం చేశాడు. వాళ్ళు జాగ్రత్తగా ఆ కమండలాన్ని తీసుకుపోతూ సహ్యపర్వతం చేరేసరికి కావేరి నదిగా మారిపోయింది.

వింధ్యపర్వతం గొడవ ఎలా వచ్చిందంటే, అది అపారంగా పెరిగిపోయి, సూర్యచంద్రులగతులకు అడ్డుతగులుతూ మునులు ఎంత వేడుకున్నా వినలేదు. వాళ్ళు మొరపెట్టగా అగస్త్యుడు వింధ్య వద్దకు వెళ్ళి, తాను దక్షిణానికి పోవటానికి దారి అడిగాడు. వింధ్య తన రూపు తగ్గించుకున్నది. తాను తిరిగి వచ్చేదాకా అలాగే వుండమని వింధ్యకు చెప్పి, అగస్త్యుడు దక్షిణానే ఉండిపోయాడు.

అగస్త్యుడు సముద్రాన్ని ఆపోశన పట్టాడని చెప్పుకుంటారు. అది ఎలా జరిగిందంటే: కాలకేయులనేవాళ్ళు మునులను తెగ పీడించేవారు. వారిని చంపటం దేవతల వల్లకాలేదు. వాళ్ళు సముద్రంలో దాక్కునే వాళ్ళు. దేవతల కోసం అగస్త్యుడు సముద్ర జలమంతా తాగేశాడు. అప్పుడు కాలకేయులు బయటపడి, దేవతలచేత చచ్చారు.



# తనదాకా వస్తే

ఒక ఊళ్ళో వీరన్న అనేవాడు చిన్నతనంలో తండ్రి పోయిన దగ్గరనుంచి తల్లి రెక్కల కష్టం చాటున పనికిరానివాడుగా తయారై, ఊరివాళ్ళ సహకారంతో పెళ్ళి చేసుకుని, ఇంకెలాగూ సంసారం గడపలేక, దొంగతనాలు చేస్తూ చాలా డబ్బు కూడబెట్టాడు. వీరన్న భార్య శాంతి మొగుణ్ణి దొంగతనాలు మానమని ఎన్ని విధాలనో చెప్పి చూసింది, కాని వీరన్న మానలేదు.

ఒకసారి వీరన్న దొంగతనానికని పొరుగూరు వెళ్ళి మూడు రోజులకు వచ్చి చూసుకుంటే, తాను దొంగతనం చేసి కూడబెట్టిన డబ్బు కనిపించలేదు. ఏమయిందని భార్యను అడిగితే, "నిన్న రాత్రి నేను నిద్రలో ఉండగా ఇంట్లో దొంగలుపడి దోచుకున్నారు," అన్నది శాంతి.

వీరన్నకు బాధా, కోపమూ వచ్చి, భార్యను తిట్టసాగాడు.

"దొంగతనం చేసి సంపాదించిన డబ్బు పోతేనే ఇంతగా బాధపడుతున్నావే, కష్టార్జితాన్ని నువు దొంగిలిస్తే ఇతరులు ఏమనుకోవాలి?" అని శాంతి అడిగింది.

"బుద్ధి వచ్చింది. ఇక ఎన్నడూ దొంగతనం చెయ్యను," అని వీరన్న భార్య మీద ప్రమాణం చేశాడు.

"నీ డబ్బు ఎక్కడికీ పోలేదు. నేనే దాచాను. ఇకనైనా న్యాయంగా బతుకు," అన్నది శాంతి.

—మాదిరెడ్డి భాస్కరరావు.





# మంచీ-చెడూ

సిరిపురంలో కనకయ్య పాపమూ, పుణ్యమూ అన్న ఆలోచనలేకుండా, రెండుచేతులా ఆర్జించి, మంచి ఆస్తి పరుడు అయాడు. అతని యాభయ్యో ఏట అతని భార్య పోయింది. పిల్లలు లేరు. తనకు తోడుగా ఉండి, అన్ని పనులూ చేసిపెడతాడని కనకయ్య రాజన్న అనేవాణ్ణి నౌకరుగా పెట్టుకున్నాడు. రాజన్న కనకయ్యకు శ్రద్ధగా సేవలు చేస్తూ వచ్చాడు.

రాజన్నకు పరిచయం ఉన్న గంగ అనే అమ్మాయి చాలా అందమైనది. సిరిపురంలో సంత జరిగిన రోజున వాళ్ళిద్దరూ కలుసుకునేవాళ్ళు.

ఒకనాడు కనకయ్య సంతకు వెళ్ళి, రాజన్నను పలకరించిన గంగను చూసి, ''ఆ అమ్మాయి ఎవర్రా?" అని రాజన్నను అడిగాడు.

''వాళ్ళది చిలకలూరు, బాబూ. వాళ్ల నాన్న పేరు రంగయ్య.'' అన్నాడు రాజన్న.

కనకయ్యకు గంగను పెళ్ళాడి, మళ్ళీ సంసారం చెయ్యాలనిపించింది. అతను పెళ్లిళ్ళ పేరయ్యను ఒకణ్ణి రంగయ్య వద్దకు రాయబారం పంపాడు. రంగయ్య పేదవాడు, తన కూతుర్ని సంపన్నుడికి ఇస్తే సుఖపడుతుందనుకుని, గంగ తనకు ఈ సంబంధం వద్దని గోలపెడుతున్నా వినిపించుకోకుండా, రంగయ్య పెళ్లి ఖర్చులకని కనకయ్య వద్దనే డబ్బు తీసుకుని, ముహూర్తం కూడా పెట్టించాడు.

గంగను పెళ్ళాడదామనుకుంటున్న రాజన్న హతాశుడయాడు. చిలకలూరులో అతనికి పర్వతాలూ, పానకాలూ అని ఇద్దరు మిత్రులున్నారు. వాళ్ళు నాటకాలు

కలువకొలను సదానంద

ఆడుతుంటారు. తనకు గంగ దక్క కుండా పోతున్నదని వాడు వాళ్ళతో చెప్పుకుని గోలపెట్టాడు. వాడికి ఎలా తోడ్పడగలమా అని వాళ్లుకూడా తెగ ఆలోచించారు. చివరకు వాళ్లు రాజన్నతో తాము చేసిన ఆలోచన ఒకటి చెప్పి అది పారితే గంగ పెళ్లి తప్పకుండా చెడిపోతుందన్నారు.

రేపు ముహూర్తమనగా కనకయ్య రాజన్నను వెంటబెట్టుకుని తరలివచ్చి, చిలకలూరి శివార్లో ఉన్న ఒక వీధిబడిలో విడిదిచేశాడు.

ఆ సాయంకాలమే ఆ ఊళ్ళో ఒక పండు ముసలిది చచ్చిపోయింది. అందు చేత కనకయ్య పెళ్లి ఆపుచెయ్యటానికి పర్వతాలుకూ, పానకాలుకూ ఒక మంచి అవకాశం దొరికింది.

అర్ధరాత్రి కావస్తుండగా, పర్వతాలు యమధర్మరాజులాగానూ, పానకాలు యమకింకరుడులాగానూ వేషాలు వేసు కున్నారు. పర్వతాలు ఒక దున్నపోతు మీద ఎక్కాడు. ఇద్దరూ వీధిబడి కేసి వచ్చారు. వీధిబడి ముందు ఆగి యమ ధర్మరాజు వికటంగా నవ్వి, "ఒరే, భల్లూకముష్టీ! భలే మొండిప్రాణంరా ఆ ముసలిదానిది! ఉచ్చులోనుంచి ఎలా గంతులువేస్తున్నదో చూడు!" అన్నాడు.

"ఔను, దొరా! తమరు వచ్చారు గనక సరిపోయిందిగాని, దాన్ని ఉచ్చు



కేసి -లాగడం నా తరమా?'' అన్నాడు కింకరుడు.

ఈ సంభాషణ విన్న కనకయ్య కిటికీ తలుపులు తెరిచి, యముళ్ళనుచూసి కొయ్యబారిపోయాడు.

యమధర్మరాజు తన కింకరుడి కేసి చూసి, ''ఓహెూ! సిరిపురం కనకయ్య కదూ వీడు? వీడి ఆయువు ఇంకో వారమే ఉన్నది. ఏడో రోజున వచ్చి, వీణ్ణి ఉచ్చులో పట్టటం మరిచిపోకు!" అన్నాడు.

''చిత్తం, మరిచిపోను, దొరా !" అన్నాడు కింకరుడు.

ఇద్దరూ ముందుకుసాగి, చీకటిలో కలిసిపోయారు.

కనకయ్య హడలిపోయాడు. అతను రాజన్నతో, ''ఒరే, వాళ్ళమాటలు విన్నావుకదూ? వాళ్ళు యములవాళ్లేనా?" అన్నాడు.

''యములవాళ్లా? నా కెవరూ కనబడ లేదే!'' అన్నాడు రాజన్న ఆశ్చర్యంగా.

కనకయ్య ఆ రాత్రి నిద్రపోలేదు. ఇంకో వారంరోజుల్లో చావబోయేవాడు; తెల్లవారి పెళ్లిపీటలమీద కూర్చోవడం దేనికి? ఒకరి బ్రతుకు భ్రష్టుచెయ్యడం దేనికి?

మర్నాడు ముహూర్త సమయంలో కనకయ్య పెళ్లిపీటలమీద కూర్చోలేదు; ''రంగయ్యా, పెళ్లి నా కెందుకుగాని, నీ కూతుర్ని మా రాజన్నకియ్యి,'' అన్నాడు.

''వేళాకోళానికైనా హద్దుండాలి! తెలిసి, తెలిసి నా కూతుర్ని గతిలేనివాడి కియ్యమంటావా?'' అన్నాడు రంగయ్య.

''గతిలేనివాడేమిటి? ఆస్తికంతకూ వారసుడు వాడే! కావలిస్తే రాసి ఇస్తాను,'' అన్నాడు కనకయ్య.

గంగకు రాజన్నతో పెళ్లి జరిగింది.

ఏడోనాడు కనకయ్య యమకింకరుల కోసం ఎదురుచూశాడు. కాని ఎవరూ రాలేదు.



# శెట్టి చాతుర్యం

గంగిశెట్టి యుక్తిపరుడు. రోజూ లక్ష్మిపూజ చేసేవాడు. లక్ష్మి కూడా అతనికి అనుకూలిస్తూ వచ్చింది. ఇంతలో ఒకనాడు లక్ష్మీదేవికి శెట్టి మీద ఏదో ఆగ్రహం వచ్చింది. ఆమె అతనికి కలలో కనిపించి, తాను అతన్ని విడిచిపెట్టి వెళ్ళిపోతున్నట్టు చెప్పింది.

శెట్టి ఆమెను వెళ్ళవద్దని ఎంత బతిమాలినా లాభం లేకపోయింది. చిట్టచివరకు శెట్టి చేసేదిలేక, "పోనీ, తల్లీ! నీకు మహాపూజ చేయించాలని ఎంతకాలంగానో ఆలోచిస్తున్నాను. కనీసం అది చేయించేవరకైనా ఉండు," అన్నాడు.

"సరే, నీ మహాపూజ అయేదాకా వెళ్ళను," అని లక్ష్మీదేవి మాట ఇచ్చింది, మహాపూజ కోసం ఉవ్విళ్ళూరుతూ.

అయితే శెట్టి మర్నాటినుంచీ మామూలు పూజ కూడా మానేశాడు. రోజులూ, వారాలూ గడుస్తున్నాయి. లక్ష్మీదేవికి కోపం వచ్చింది. ఆమె శెట్టికి కలలో కనిపించి, "మహాపూజ ఎప్పుడు చేయిస్తావు? నేను ఈ రోజే వెళ్ళిపోతున్నాను!" అన్నది.

"తల్లీ, మహాపూజ జరిగినదాకా వెళ్ళనని మాట ఇచ్చావు," అన్నాడు శెట్టి.

శెట్టి ఈ జన్మలో మహాపూజ చెయ్యడని లక్ష్మీదేవికి అర్థమయింది. "పోనీ మామూలు పూజ అయినా చెయ్యి," అని ఆమె అదృశ్యమయింది.

—బి. మేరీ.



# బుద్ధిలేనివాళ్లు

ఒక ఊళ్ళో సుబ్బయ్యా, సూరయ్యా అని ఇద్దరు శ్రమజీవులుండేవారు. వారిని అందరూ బుద్ధి లేనివాళ్ళు అనేవారు. ఒకసారి సుబ్బయ్య గ్రామాధికారిని కలిసి, "అయ్యా, నన్ను అందరూ బుద్ధిలేని వాడంటారు గదా, అది నిజమేనా?" అని అడిగాడు.

"నే నొకటి అడుగుతాను చెప్పు. మా కుటుంబంలో నలుగురు వున్నారు. ఒకతె నా భార్య, ఇంకొకతె నా కూతురు. మూడోవాడు నా కొడుకు. నాలుగోమనిషి ఎవరు?" అని గ్రామాధికారి అడిగాడు.

"తమరు చెబితేగా నాకు తెలిసేది?" అన్నాడు సుబ్బయ్య.

"ఓరి బుద్ధిలేనివాడా, నాలుగోవాణ్ణి నేనే!" అన్నాడు గ్రామాధికారి.

తరవాత సుబ్బయ్య సూరయ్యకు అదేపరీక్ష పెట్టుతూ, "సూరయ్యా, ఒకటి అడుగుతా, చెప్పు! మా కుటుంబంలో నలుగురు. ఒకతె నా భార్య. ఇంకొకతె నా కూతురు. మూడోవాడు నా కొడుకు. నాలుగోమనిషి ఎవరు?" అని అడిగాడు.

"నువేగా?" అన్నాడు సూరయ్య.

"ఓరి బుద్ధిలేనివాడా, నాలుగోవాడు మన గ్రామాధికారి!" అన్నాడు సుబ్బయ్య.

—ఎస్. విదురప్రసాద్





# వామనుడూ-బలీ

ప్రహ్లాదుడి మనుమడైన బలి మహా శూరుడు. అతను భూమండలమంతా జయించి మహా చక్రవర్తి అయాడు. అయినా అంతటితో అతనికి తృప్తి కలగలేదు.

అతను స్వర్గం మీద దాడి చేశాడు. దేవతలు అతని ధాటికి నిలవలేక పోయారు. బలికి దాసులుగా ఉండి పోవటమో, లేక స్వర్గం నుంచి వలస పోవటమో తప్ప వారికి మరో మార్గం లేదు.





దిక్కు తెలియని దేవతలు విష్ణువు వద్దకు వెళ్ళి, తమ పరిస్థితి గురించి మొరపెట్టుకున్నారు. బలి మహా బలశాలి అయినప్పటికీ ఉదారుడూ, సత్యసంధుడూనూ. ఈ మాట విష్ణువుకు తెలుసును. బలిని ఇతర రాక్షసులలాగా ఓడించటం సాధ్యం కాదు.



విష్ణువు కశ్యపుడికి అదితి గర్భాన కొడుకై పుట్టాడు. అతను మరుగుజ్జుగా తయారై, వామనుడు అన్న పేరు పొందాడు. అతను వేద వేదాంగాలన్నీ అభ్యసించి, బ్రాహ్మణోత్తముడనిపించు కున్నాడు.

బలి మహాయజ్ఞం చేశాడు. అనేక వందలమంది బ్రాహ్మణులు ఋత్విక్కులుగా పనిచేశారు. ఆ సందర్భంలో బలి ఎవరేది కోరినా ఇస్తానని ప్రకటించాడు.





అందరూ బలి నుంచి తాము కోరిన దానాలు పుచ్చుకున్నారు. వామనుడి వంతు వచ్చింది. వామనుడు బలిని మూడడుగుల స్థలం ఇయ్యమని కోరాడు. బలి సరేనని, వామనుడు కోరినది ధారాదత్తం చెయ్యబోయాడు.

బలికి గురువైన శుక్రుడు, వామనుడు విష్ణువేనని తెలుసుకుని, బలిని దూరంగా తీసుకుపోయి, వామనుడు కోరిన దానం ఇయ్యవద్దన్నాడు.





కాని బలి ఆడినమాట తప్పేవాడు కాడు. అందుచేత శుక్రాచార్యుడు చిన్న పురుగు రూపంలో జలపాత్ర కొమ్ముకు అడ్డంపడ్డాడు. పాత్ర నుంచి ధార రాలేదు.

కొమ్ములో దర్భతో పొడవమని వామనుడు అనేసరికి, బలి అలాగే చేశాడు. శుక్రుడు బయటికి వచ్చి యథారూపం ధరించాడు, కాని ఆయన కన్ను ఒకటి పోయింది.





బలి మూడడుగుల స్థలం ధారాదత్తం చేయగానే, వామనుడు అపారంగా పెరిగిపోయి, ఒక పాదంతో భూమినీ, ఇంకో పాదంతో ఆకాశాన్ని ఆక్రమించాడు.

బలి ఇది చూసి నిర్ఘాంతపోయాడు. వామనుడు బలిని మూడో అడుగు ఎక్కడ పెట్టనని అడిగాడు. బలి తన తల చూపాడు. వామనుడు తన పాదంతో బలిని పాతాళానికి తొక్కేశాడు. ఆ విధంగా ఒక పొట్టి మరుగుజ్జు చేతిలో మహాశూరుడు ఓడిపోయాడు.





బలి భార్య అయిన వింధ్యావళి, తన భర్తకు అన్యాయం చేయవద్దని వామనుణ్ణి ప్రార్థించింది. బలి ఆజ్ఞకు తిరుగు ఉండదని, అతని వాకిలికి తానే స్వయంగా కాపలి ఉంటాననీ విష్ణువు చెప్పాడు.



# ధ్రువుడు

మొట్టమొదటి మనువు అయిన స్వాయంభువుడికి అనంత అనే భార్యవల్ల ఉత్తానపాదుడు అనే కొడుకు కలిగాడు. అతనికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్య సునీతికి పుట్టినవాడు ధ్రువుడు. రెండవ భార్య అయిన సురుచి ఉత్తముడు అనే కొడుకును కన్నది.

ఉత్తానపాదుడికి తన చిన్న భార్య అయిన సురుచి అంటే ఎక్కువ ఇష్టం. అందుచేత ఉత్తానపాదుడు ఆమె ఏమి చేసినా తప్పు పట్టేవాడు కాడు.

ఒకసారి ధ్రువుడు వచ్చి తన తండ్రి తొడమీద కూర్చున్నాడు. అది చూసి సురుచి వచ్చి, "అలా కూర్చునే అర్హత నీకు లేదు. అది నా కొడుక్కు మాత్రమే ఉన్నది. అలా నీ తండ్రి తొడమీద కూర్చో దలచినట్టయితే నువు నా గర్భవాసాన పుట్టి ఉండవలసింది. లే, లే!" అని ధ్రువుణ్ణి ఉత్తానపాదుడి తొడమీది నుంచి లాగేసింది.

ఇలా చేసినందుకు ఉత్తానపాదుడు సురుచిని మందలించక, ఆమె చేసిన పనిని ఆమోదించిన వాడిలాగా ఉండిపోయాడు.

ధ్రువుడికి చాలా కోపం వచ్చింది. అతను వెళ్ళి తన తల్లితో జరిగిన సంగతి చెప్పాడు. కాని, భర్త అభిమానాన్ని సంపాదించటంలో ఆమె తన సవతితో పోటీ చేయలేని నిస్సహాయురాలు.

తన తండ్రి ఇంట తనకు స్థానం లేదని నిశ్చయించి, ధ్రువుడు తల్లి అనుమతితో తపోవనానికి వెళ్ళాడు. అక్కడ అతను సప్తర్షులను కలుసుకొని, వారి నుంచి తపస్సు చేసేవిధం తెలుసుకుని, విష్ణుమూర్తిని గురించి తపస్సుచేశాడు. అతనికి విష్ణువు ప్రత్యక్షమై, వరాలిచ్చాడు.

తనకొడుకు విష్ణువల్ల వరాలు పొంది తిరిగి వచ్చాడని తెలియగానే, ఉత్తాన పాదుడు పరమానందభరితుడై, ధ్రువుడికి రాజ్యాభిషేకం చేసి, తాను తపస్సు చేసుకోబోయాడు. ఆ విధంగా ధ్రువుడు తన తండ్రికి తానే ముఖ్యమైన కొడుకు అనిపించుకున్నాడు.

ఇతని తమ్ముడు ఉత్తముడు పెళ్ళాడి తండ్రివంశం నిలబెట్టక, హిమాలయంలో వేటాడుతూ, యక్షుల చేత చంపబడ్డాడు. ధ్రువుడు అందుకు అలిగి, కుబేరుడి అలకాపురం మీద దాడిచేసి, యక్షులను చంపసాగాడు.

కుబేరుడు ధ్రువుడితో సంధి చేసుకుని, యక్షులవధ ఆపగలిగాడు.

ధ్రువుడికి చాలామంది భార్యలు. వారి వల్ల అతను అనేకమంది కొడుకులను కని, తన తండ్రి వంశాన్ని పెంపొందించాడు.

ఇతని భార్యలలో ఒకతె ధన్య. ఆమెకు కలిగిన కొడుకు శిష్టుడు. శింశుమారు డనే రాజుకూతురు భ్రమి ధ్రువుడి భార్యలలో మరొకతె. ఆమె కుమారులు కల్పుడూ, వత్సరుడూనూ. ధ్రువుడికి వాయువు కుమార్తె అయిన ఇల కూడా ఒక భార్య. ఆమెకు ఉత్కలుడు పుట్టాడు. శంభువు అనే మరొక భార్యకు భవ్యుడూ, శ్లిష్టి అనే కొడుకులు పుట్టారు. ఈ భార్యలు కాక ధ్రువుడికి మరొక విచిత్రమైన భార్య ఉండేది. ఆమె అతని నీడే! ఆ నీడను ధ్రువుడు స్త్రీని కమ్మనేసరికి, అలాగే అయి, అతన్ని పెళ్ళాడి అయిదుగురు కొడుకులను కన్నదట!

పూర్వజన్మలో ధ్రువుడు బ్రాహ్మణు డనీ, అతనికి ఒక రాజుతో స్నేహం ఉండేదనీ, ఆ కారణంగా అతను రాజ్యం ఏలాలనే కోరికతో ఈ జన్మలో క్షత్రియుడై పుట్టి, ప్రజానురంజకంగా రాజ్యమేలాడనీ చెబుతారు.

విష్ణువు అనుగ్రహంతో ధ్రువుడు నక్షత్రమై, ఇప్పటికీ ఉత్తరదిశన ప్రకాశిస్తున్నాడు.



# తెలివైన ప్రశ్న

శృంగేరి రాజు ఆస్థానానికి విద్యాసాగరు డనే పండితుడు వచ్చి, తనను ఓడించగల ఆస్థాన పండితుడికి తన స్వర్ణకంకణం ఇచ్చిపోతానన్నాడు. అయితే ఆస్థానపండితులే అతని చేతిలో ఓడారు. అప్పుడు ఆస్థాన విదూషకుడు విద్యాసాగరుడితో, "నేను మిమ్మల్ని అయిదు ప్రశ్నలు అడుగుతాను. వాటికి మీరు తప్పుడు సమాధానాలియ్యాలి. సరి అయిన సమాధానమిస్తే ఓడిపోతారు," అన్నాడు.

విద్యాసాగరుడు అందుకు ఒప్పుకుని విదూషకుడి ప్రశ్నలకు తప్పుడు సమాధానాలియ్య సాగాడు. "మీది దేశాంతరం కదూ?" అంటే "లేదు. మాది మీ దేశమే," అన్నాడు. "మీరిప్పుడు మీ దేశంలోనే వున్నారా?" అంటే, అవునన్నాడు. "మీ వద్ద స్వర్ణకంకణం ఉన్నదిగదా?" అంటే, లేదన్నాడు. "మా రాజు పేరు మహిపాలుడు కదా?" అంటే కాదన్నాడు.

విదూషకుడు ఏదో మరిచినట్లు నటించి, "ఇప్పటికి ఎన్ని ప్రశ్నలయాయి?" అంటే విద్యాసాగరుడు, "నాలుగయాయి. ఇంకోటి అడగండి," అన్నాడు.

"నా అయిదో ప్రశ్నకు సరి అయిన సమాధానం చెప్పి, ఓడిపోయారు," అన్నాడు విదూషకుడు.

—కోలార్ కృష్ణఅయ్యర్.





పూర్వం చీనా దేశంలోని పీకింగ్ నగరంలో ఒక దర్జీ ఉండేవాడు. అతని పేరు చింగ్. అతని తండ్రికూడా దర్జీయే. అయితే అతను పోతూ, పోతూ చింగ్‌కు ఒక్క కుట్టుమిషను తప్ప ఇంకేమీ మిగల్చలేదు. చింగ్ తండ్రిలాగా దురలవాట్లు కలవాడూ, దుబారా మనిషీ కాడు. అతను కష్టించి, శ్రద్ధగా పనిచేసి, తన ఖాతాదార్లను తృప్తిపరచి, త్వరలోనే మరి నాలుగు కుట్టుమిషనులు కొని, నలుగురు మనుషులకు జీవనోపాధి కలిగించాడు.

చింగ్‌మూలంగా అదే వీధిలో ఉండే పదిమంది దర్జీలకు పనులులేకుండా పోయాయి. వాళ్ళకు పనిపట్ల లక్ష్యం లేదు. బట్టలు కుట్టి ఇస్తామన్న రోజుకు ఎన్నడూ ఇచ్చేవారు కారు. వాళ్లచుట్టూ తిరగలేక ప్రాణం విసిగిఉన్న గ్రామస్థులకు చింగ్ ఎంతో తృప్తి కలిగించాడు. చింగ్ మూలంగా దెబ్బతినిపోయిన దర్జీలందరూ సమావేశం జరిపి, చింగ్‌ను పతనంచెయ్యడం ఎలాగా అని ఆలోచించారు. వాంగ్ అనేవాడు, చింగ్‌కు భూతవైద్యుడిచేత చేతబడి చేయిస్తే వాడు అడుగంటిపోతాడని చెప్పాడు.

అందరూ ఇందుకు సిద్ధపడి, కట్టగట్టుకుని భూతవైద్యుడి ఇంటికి వెళ్లారు. భూతవైద్యుడి ఇల్లు తాళంపెట్టి ఉన్నది. తన బంధువులెవరికో జబ్బుగాఉంటే, అతను పొరుగూరు వెళ్ళాడట.

మర్నాడు వాంగ్ దుకాణానికి భూతవైద్యుడులాటివాడు ఒకడు వచ్చి, పెద్దగా పెడబొబ్బపెట్టి, "నిన్న ఎవరో మా గురువుగారిని తలచుకున్నారట. ఆయన నన్ను పంపించారు. ఏమిటి విశేషం?" అన్నాడు.

---

ఎమ్.వి.వి. సత్యనారాయణ

---

అతన్ని చూస్తుంటే వాంగ్‌కు అతని మీద గురి కుదిరింది. అతను భూత వైద్యుడితో అంతా చెప్పాడు.

''భూతాన్ని ఆవాహన చెయ్యాలి. ఖర్చు అవుతుంది, భరించగలవా?'' అన్నాడు భూతవైద్యుడు.

"అంతా పదిమంది ఉన్నాం. ఖర్చు పంచుకుంటాం,'' అన్నాడు వాంగ్.

''నీకు ఒక మంత్రపు నిమ్మకాయ ఇస్తాను. అందులో ఒక బంగారపు నాణెం పెట్టి, దాన్ని చింగ్ దుకాణంలో చేర్చు. మీకు వాడి బెడద తొలగిపో తుంది,'' అంటూ ఒక చీల్చిన నిమ్మ కాయను భూతవైద్యుడు వాంగ్‌కు ఇచ్చాడు.

వాంగ్ దగ్గిర బంగారు నాణెం లేదు. కాని తన దగ్గిర ఉన్న వస్తువులు తెగ నమ్మి ఒక బంగారు నాణెం సంపాదించి దాన్ని నిమ్మకాయలో పెట్టి, చింగ్ దుకాణానికివెళ్లి, అదీఇదీ మాట్లాడుతూనే నిమ్మకాయను చల్లగా దుకాణంలో ఒకపక్కజార్చి, వెళ్లిపోయాడు.

ఈలోపుగా భూతవైద్యుడు మిగిలిన దర్జీలకుకూడా అలాగే నిమ్మకాయలిచ్చి, వాటిలో బంగారు నాణాలు పెట్టి చింగ్ దుకాణంలో వదలమని చెప్పాడు. అందరూ అలాగే చేశారు.

రోజులు గడుస్తున్నాయి. చింగ్ పతనం



కాకపోగా, తన దుకాణాన్ని పెద్దదిచేసి, మరింత అందంగా అలంకరించి, మరో పది కుట్టుమిషనులు కొన్నాడు.

దర్జీలకు మతులు పోయాయి. వాళ్ళు భూతవైద్యుడి ఇంటికి వెళ్ళి, ''మీ శిష్యుడు ఉండేది ఎక్కడ?" అని అడిగారు.

భూతవైద్యుడు ఆశ్చర్యంగా, ''నాకు శిష్యులెవరు? నేనే ఈ వృత్తిలో పొట్ట గడవక అవస్థపడుతూంటే, నాకు శిష్యులుకూడానా?'' అన్నాడు.

వాంగ్ అయోమయంలో పడి పోయాడు. చింగ్ తన దుకాణం చూడ రమ్మని వీధిలోని మిగతా దర్జీలకు

ఆహ్వానం పంపారు. అతనికి దశ ఎలా ఎత్తుకున్నదీ తెలుసుకుందామని దర్జీ లందరూ చింగ్ దుకాణానికి వెళ్ళారు. చింగ్అందరికిచక్కని ఆతిథ్యం ఇచ్చాడు.

వాంగ్ ఉండబట్టలేక, ''చింగ్, ఉన్నట్టుండి నీకు ఇంత డబ్బు ఎలా వచ్చింది?'' అని అడిగాడు.

''ఏ అదృష్టదేవతో నా దుకాణానికి పది నిమ్మకాయలూ, పది బంగారు నాణాలూ పంపింది. నిమ్మకాయలతో షర్బత్ చేసుకుని తాగేసరికి అంతులేని శక్తి కలిగింది. బంగారంతో కొత్త కుట్టు మిషనులు కొని దుకాణాన్ని పెద్దది చేశాను,'' అన్నాడు చింగ్.

దర్జీలు ఏడుపుమొహాలు పెట్టి, ''ఆ బంగారు నాణాలు మావే. నిన్ను దివాలా తీయించాలని, మా కున్నదంతా పెట్టి, బంగారు నాణాలతోబాటు మా దారి ద్రవ్యాన్ని నీకు పంపకం చేద్దామను కున్నాం. కాని మా ప్రయత్నం బెడిసి కొట్టింది,'' అన్నారు.

చింగ్ నవ్వి, ''ఆ సంగతి నాకు తెలియదు,'' అన్నాడు.

దర్జీలు లబలబ లాడారు.

చింగ్ వాళ్ళతో ఎంతో స్నేహంగా, ''కొత్త కుట్టుయంత్రాలు కొన్నానుగద. వాటి మీద పనిచేసేవాళ్ళు అవసరం. మీలో ఎవరువచ్చి పనిచేసినా నాకు అభ్యంతరంలేదు. కుట్టు కూలిలో నేనేమీ ఉంచుకోను. ఎంత హెచ్చు పని చేయగలిగితే అంత హెచ్చు డబ్బు గిట్టు బాటవుతుంది,'' అన్నాడు.

దర్జీలందరూ చింగ్ కింద పనిచెయ్య టానికి ఒప్పుకుని, ఆ రోజే పని ప్రారంభించారు.

ఆ రోజు దర్జీలు తనపై చాతబడి చేయించటానికి కుట్రపన్నినప్పుడు తాను చాటునఉండి అంతా విని, తానే భూత వైద్యుడి శిష్యుడుగా వచ్చినసంగతి చింగ్ మిగతా దర్జీలకు తెలియనియ్యలేదు.



# గుళ్లో పెళ్లి

శేషయ్య ఆఖరు కూతురికి పెళ్ళి నిశ్చయం అయింది. గుళ్ళో పెళ్ళి చెయ్యటానికి అందరూ ఒప్పుకున్నారు గాని, ఏ గుడిలో చెయ్యాలన్న విషయం ఏ ఇద్దరికీ అభిప్రాయం కలవలేదు. శేషయ్య తన ఊళ్ళో ఉన్న వెంకటేశ్వరస్వామి గుళ్ళో చేతామన్నాడు. పెద్ద కొడుకు హనుమదుపాసి, హనుమంతుడి గుళ్లో పెళ్ళి జరగాలన్నాడు. శేషయ్య రెండో కొడుకు రామాలయంలోనని పట్టుబట్టాడు. శేషయ్య పెద్ద కూతురు అందరు దేవుళ్ళకూ ఆదిదేవుడు వినాయకుడి గుడిలోనే పెళ్ళి చెయ్యమన్నది.

ఈ కీచులాట చూసి పెళ్లి కూతురు, "పెళ్ళి ముహూర్తం పెట్టే జ్యోతిష్కుణ్ణే అడిగి, ఏ గుళ్లో పెళ్ళి చెయ్యమంటాడో తెలుసుకోండి," అన్నది.

జ్యోతిష్కుడు అందరి అభిప్రాయాలూ విని, "పెళ్ళి ఏ గుడిలోనూ జరగటం అంత మంచిది కాదు. వెంకటేశ్వరుడికి ఇద్దరు పెళ్ళాలు. హనుమంతుడు ఘోటక బ్రహ్మచారి. వినాయకుడు బ్రహ్మచారి అని కొందరూ, ఆయనకు ఇద్దరు పెళ్ళాలని కొందరూ అంటారు. పోతే రాముడు అన్ని విధాలా మంచివాడేగాని, అతన్ని పెళ్ళాడి సీత, చూడండి, ఎన్ని ఇక్కట్లు పడిందో! నిక్షేపంగా మీ స్వగృహంలోనే పెళ్ళి చెయ్యండి," అన్నాడు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి.





# గొప్పవాడి గొప్పతనం

విశాలదేశం లోని రూపవర గ్రామంలో ఎందరో గొప్పవా రుండేవారని చెప్పుకునేవారు. అక్కడ ఎందరో సంగీత విద్వాంసులూ, మహానటులూ, మహాకవులూ, శిల్పులూ ఉండేవారు. వాళ్లు పేద సాదలకోసం తాము సంపాదించిన ధనమంతా ఉపయోగించేవారట.

విశాలదేశపు రాజు విజయసేనుడు రూపవర గ్రామంలోని గొప్పవాళ్ళను గురించి విని, ఆ ఊళ్లో అందరిలోకీ గొప్పవాడెవరో తెలుసుకురమ్మని తన మంత్రినీ, సైన్యాధిపతినీ, పురోహితుణ్ణీ, కోశాధికారినీ, మరికొందరు ఇతరులనూ పంపాడు. అందరిలోకీ గొప్పవాడెవరో ఎవరూ చెప్పలేకపోయారు. చివరకు రాజు మారువేషంలో తానే స్వయంగా వెళ్లివచ్చి, తానుకూడా తన అనుమానాన్ని తీర్చుకోలేకపోయాడు.

ఇలా ఉండగా చిరంజీవి అనే మహాజ్ఞాని ఆ దేశం వచ్చాడు. రాజు చిరంజీవిని తన సన్నిధికి పిలిపించుకుని, ఆయననుంచి ఎన్నో విశేషాలు విని, తనను బాధిస్తున్న సమస్య చెప్పాడు.

రూపవర గ్రామంలో అందరికన్న గొప్పవాడు ఎవరో తెలుసుకుని వస్తానని చిరంజీవి ఆ గ్రామానికి వెళ్ళాడు.

మాధవయ్య అనేవాడు చిరంజీవికి ఊరి పొలిమేరలోనే ఎదురుపడి, ''మీరు మా ఊళ్ళోగల గొప్పవాళ్ళను చూడడానికి వస్తున్నారా? ఒక్కొక్క గొప్పవాణ్ణి చూపించటానికి ఒక్కొక్క బంగారుకాసు తీసుకుంటాను. సమ్మతమైతే నా వెంట రావచ్చు.'' అన్నాడు.

ఈ విషయం రాజుద్వారా ముందే విని ఉండడంవల్ల చిరంజీవి ఆశ్చర్యపడలేదు. మాధవయ్య ఒక్కరోజులోనే చిరంజీవికి

"వసుంధర"

అరవైమంది గొప్పవాళ్లను పరిచయం చేసి, అరవై బంగారుకాసులు సంపాదించుకున్నాడు.

చిరంజీవి తాను చూసిన గొప్పవాళ్లను చూసి చాలా ఆశ్చర్యపడ్డాడు. వాళ్లు అయనతో తాము చేసిన గొప్పపనులను గురించి చెప్పుకున్నారు. దేశంలో ఆర్థికంగా ఇబ్బందిపడేవారికి వారినుంచి ధనసహాయం అందుతున్నది.

''రేపు ఇంకా చాలామందిని చూపిస్తాను," అన్నాడు మాధవయ్య.

''అంతా బాగానే ఉన్నది గాని, ఇంత గొప్పవాళ్లున్న గ్రామంలో బంగారు కాసు వసూలుచేసే నీలాటివాళ్లుకూడా ఉండడం నాకు విచారం కలిగిస్తున్నది,'' అన్నాడు చిరంజీవి.

మాధవయ్య వెంటనే, తాను తీసుకున్న డబ్బు చిరంజీవికి ఇచ్చేసి, ''మీరు బాధపడుతూ ఇచ్చినట్టయితే నాకిది వద్దు. మీకు బాధలేకుండా ఇయ్యగలిగినంతే ఇయ్యండి,'' అన్నాడు.

చిరంజీవి ఆశ్చర్యంగా, ''బాగానే ఉన్నది నీ వరస! ఈ డబ్బేం చేసుకుంటావు?" అని అడిగాడు.

''అదంతా మీ కెందుకు, బాబూ? చెబితే మీరేమైనా ఆరుస్తారా? తీరుస్తారా?" అన్నాడు మాధవయ్య.

"ఆర్చగలను, తీర్చగలను, అన్నీ



చేయగలను. సంగతేమిటో చెప్పు." అన్నాడు చిరంజీవి.

''అయితే నాతో రండి,'' అని మాధవయ్య చిరంజీవిని ఊరికి దూరంగా తీసుకుపోయాడు. అక్కడ కొన్ని గుడిసెలున్నాయి. అందులో చాలా హీనంగా బ్రతుకుతున్న మనుషులున్నారు.

''ఎవరు వీళ్లు ?'' అని చిరంజీవి మాధవయ్యను అడిగాడు.

''పాతికేళ్లక్రితం మా ఊరికి ఏమంత పేరులేదు. అప్పుడొక సన్యాసి ఇక్కడికి వస్తే, ఈ మనుషులు ఆయనను పని గట్టుకుని అవమానించారు. వీళ్ల బ్రతుకులు నికృష్టమైపోవాలనీ, ఎవరు వీళ్లను ఆదరిస్తే వాళ్లు సర్వనాశనం

కావాలనీ సన్యాసి వీళ్ళను శపించాడు. ఊరివాళ్లు భయపడి వేడుకోగా, ఎవరైనా ఊరు వదిలిపెట్టకుండా బంగారు కాసులు సంపాదించి, వీళ్ళకు మనిషికి వెయ్యి చొప్పున ఇయ్యగలిగితే వీళ్లు మళ్ళీ సుఖంగా జీవించ గలుగుతారన్నాడు సన్యాసి. మీరే చెప్పండి, ఎన్ని బంగారు కాసులుంటే మనిషికి వెయ్యిచొప్పున పొగవుతాయి?'' అన్నాడు మాధవయ్య.

"వీళ్ళకు సహాయంచేసి సర్వనాశన మైపోతావని నీకు భయంలేదా?'' అని చిరంజీవి అతన్ని అడిగాడు.

''అందుకే నేను పెళ్లి మానేశాను. రాత్రి ఏ చెట్టు కిందనో పడుకుంటాను. సర్వనాశనం కావడానికి నాకేమున్నది? ఇప్పటికి నా సంపాదనతో అయిదుగురికి సుఖజీవనం కలిగించాను. ఇంకా ఎందరికి కలిగించగలనో చూస్తాను,'' అన్నాడు మాధవయ్య.

చిరంజీవి ఆ గ్రామంలో ఇంక ఒక్క క్షణంకూడా ఉండలేదు. ఆయన విజయ సేనుడి వద్దకు తిరిగి వచ్చి,తన అనుభవ మంతా చెప్పి, ''మీరు తక్షణం మాధ వయ్యకు అవసరమైన డబ్బు పంపండి. ఆ గ్రామంలో అందరికన్నా అతనే గొప్పవాడని నా అభిప్రాయం,''అన్నాడు.

''దీనజనోద్ధరణ చేస్తున్నాడనేనా ?" అని విజయసేనుడు అడిగాడు.

''కాదు. గొప్పవాడి గొప్పతనం తాను గొప్పవాడినని తన నోటితో అనకుండా, ఇతరుల నోట అనిపించు కోవడంలోనే ఉన్నది. ఊరందరి గొప్పతనాన్నీ పొగడుతూ, మాధవయ్య ఓ మహాకార్యం కోసం శ్రమిస్తూంటే, అతని గొప్పతనాన్ని గుర్తించని ఆ గ్రామవాసులు మాధవయ్య కన్న గొప్పవారు ఎలా అవుతారు?'' అన్నాడు చిరంజీవి.

చిరంజీవి సమాధానానికి రాజు చాలా సంతోషించి, ఆయనను ఘనంగా సత్కరించాడు.





# అనాగరికుడెవరు?

పూర్వం ఒకప్పుడు ఈజిప్టుదేశాన్ని మెహర్ అనే ఒక గొప్ప సుల్తాను పరిపాలించాడు.

ఉన్నదానితో తృప్తిపడక, రాజ్యాన్ని పెంచాలన్న ఆశ కలిగిందాతనికి. ఈ ఆశతో మెహర్ సుల్తాను చుట్టుపక్కల దేశాలన్నింటినీ ఆక్రమించుకుని, ఆ రాజుల చేత కప్పాలు కట్టించుకుని, చక్రవర్తి ననిపించుకోవాలని నిశ్చయించుకున్నాడు. వెంటనే ఖజానాలో సొమ్ము అంతా వెచ్చించి గొప్ప సేనలు పోగుచేసి విజయయాత్ర సాగించాడు.

దండెత్తి వచ్చిన మెహర్‌ను పౌరుషవంతులైన రాజులు కొందరు ఎదిరించారు. కాని సముద్రానికి మల్లే పొంగివచ్చిన ఈజిప్టు సేనల ముందు వాళ్ళ పౌరుషం వృధా ఐంది. ఆ మహావీరులు యుద్ధంలో ప్రాణాలను కోల్పోవలసి వచ్చింది. ఎదిరించి లాభంలేదని, కొందరు రాజులు సంధి చేసుకొని కప్పాలు కట్టడానికి ఒప్పుకొన్నారు.

రాజ్యాలు వశమౌతున్న కొద్దీ మెహర్‌కి రాజ్యదాహ మెక్కువైంది. కొత్తగా వశమైన దేశాలలోని సొమ్మంతా కొల్లగొట్టి తీసుకుపోయి కొత్త సైన్యాలు పోగుచేసి కొత్త ప్రాంతాల పైన ఇంకా దండయాత్రలు సాగించాడు. ఇలా దౌర్జన్యానికి గురి ఐన దేశాలలో 'షికాంగూ' అనేది ఒకటి.

షికాంగూ కొండలతోనూ, అడవులతోనూ నిండివున్న దేశం. అహంకారం కొద్దీ మెహర్ ఆ దేశాన్ని కూడా ముట్టడించాడే కాని, దాని జోలికి పోకపోతేనే తీరిపోను. షికాంగూ రాజు అనుచరులంతా మన దేశంలోని భిల్లుల వంటి ఆటవికులు. ఏ చెట్టుమీదో, పుట్టవెనుకనే పొంచి ఉండి విషం పూసిన బాణాలు ప్రయోగించి మెహర్ సేనలో చాలామంది



వీరుల ప్రాణాలు తీశారు. ఏమరుపాటున రాత్రివేళ నిద్రపోతూండగా చూసి చీమల బారులకు మల్లే తండోప తండాలుగా కొండ దిగివచ్చి, మెహర్ సైనికులలో ఎక్కడివాళ్ళ నక్కడ నరికి పోగెట్టి పారిపోయారు.

అప్పుడు ముఖ్యసేనాని, చక్రవర్తితో, "ప్రభూ! మన మీ దండయాత్ర వదులుకుని తిరుగుదారి పట్టడం శ్రేయస్కరం. చాపగా మిగిలిన సైనికులంతా స్వదేశానికి పోవాలని కోరుతున్నారు," అని మనవి చేశాడు. కాని మెహర్, సేనాని సలహాను ఒప్పుకోలేదు. అతనికి పట్టుదలే ప్రధానం.

"ప్రభూ! తమరు చక్రవర్తులనిపించుకున్నారు. నైలునదీ ప్రాంతాని కంతకూ ఏకచ్ఛత్రాధిపత్యం వహించారు! ఇంతతో ఆగడం మంచిది, జయించిన దేశాలను నిలబెట్టుకోగలిగితే అదే పదివేలు," అన్నాడు సేనాని.

"ఈ షికాంగూ రాజ్యాన్ని వశం చేసుకోవాలి, కదలాలి. ఇంతమందిని లొంగదీసుకుని చివరికి ఒక కొండరాజుకు లొంగిపోవటమా? అదేం కుదరదు," అన్నాడు మెహర్.

మెహర్ అజ్ఞకు తిరుగులేదు. లెక్కలేకుండా సొమ్ము వెచ్చించి కొత్త సేనలను రప్పించారు. ఆ రాజును వశం చేసుకోవాలన్న పట్టుదలే గాని రాళ్ళూ రప్పలూ, తుప్పలూ తప్ప యేమీలేని ఆ అడవులను వశం చేసుకోవటంవల్ల ఒరిగే భాగ్య మేమీ లేదని మెహర్‌కు తట్టలేదు.

పట్టుదలే ప్రధానంగా, షికాంగూ రాజైన బెట్సూను జీవాలతోకాని, చంపివేసిగాని తెచ్చి ఎదుటపెట్టిన వాడికి వెయ్యి మొహరీ లిస్తానని సైనికులను పురికొలిపాడు!

మెహర్ సైనికులు అదేపనిగా అడవిలో చొరపడి కనపడ్డ భిల్లవీరుడినల్లా వధించటం మొదలెట్టారు. భిల్లు డొక్కొక్కడూ

పదేసిమందిని చంపితేగాని చావలేదు. కాని నేల ఈనినట్టుగా పుట్టుకొస్తున్న ఈజిప్టు సేనలను నెగ్గుకురావటం అసాధ్య మని అనిపించింది వాళ్ళకు.

బెట్సూ రాజు మొదట సంధిచేసు కుందా మనుకున్నాడు కాని, మెహర్ ఒప్పుకోడనీ, సంధికోసం వెడితే పట్టుకుని కసికొద్దీ చిత్రవధ చేయిస్తాడనీ తెలుసు కాబట్టి, ఈ పరిస్థితిలో యుద్ధం చేసి వీర స్వర్గం పొందటమే మేలనుకున్నాడు. ఈ నిశ్చయంతో భిల్లుల నందరినీ వెంట బెట్టుకుని ఈజిప్టు సేనలను రెండు కొండల మధ్య ఘోరంగా ఢీకొన్నాడు.

ఆ మహాయుద్ధంలో మెహర్‌కే విజయం లభించింది. భిల్లవీరు డొక్కడూ మిగల లేదు. ఐతే, మెహర్ సైన్యంలోనూ వేలాది సైనికులు ప్రాణాలను కోల్పోయారు.

''బెట్సూ యెక్కడ?'' అని అడిగాడు మెహర్ ఆత్రంతో.

''గాయాలతో నిండివున్న అతని కళే బరం, యీ దాపులనే మన సైనికుల పీనుగుల మధ్య పడివుంది ప్రభూ!'' అన్నాడు ఒక సేనాని.

చూడాలన్న ఆసక్తితో మెహర్ టయల్దేరి వెళ్లాడు. అతను చేరుకునేసరికి అక్కడ, కారునలుపు శరీరంతో, యెత్తయిన మనుష్యు డొకడు ఆ వేలాది



పీనుగుల మధ్య నలువంకలా పరికిస్తూ నిలబడి వున్నాడు.

వాణ్ణి చూడటంతోనే మెహర్, ''ఎవరు నువ్వు?'' అన్నాడు.

''వీ డెవడో నరమాంస భక్షకుడు, పీనుగులను పీక్కు తినడానికి వచ్చాడు,'' అన్నాడు సేనాని.

సేనాని చెప్పిన మాట నిజమే. ఆఫ్రికా దేశపు అడవులలో మనుష్యుల మాంసం తినేవాళ్ళు ఎందరో ఉన్నారు.

మెహర్ ఆ నరమాంస భక్షకునితో, ''ఇంత మాంసం లభించింది కదా, ఏదో శవాన్ని తీసుకుపోక, అలా దిక్కుదిక్కులు చూస్తున్నావేం?'' అని అడిగాడు.

"వీళ్ళ నందరనూ తినడాని కెవరో చంపుకొన్నారు. నాకు కావలసినది ఒక్కటే శవం. ఐనా, వారి అనుమతి తీసుకుని మరీ తినడం ధర్మం కదా! అందుకని ఆ చంపిన వారి కోసం ఎదురుచూస్తున్నాను," అన్నాడు నల్లవాడు.

మెహర్ నవ్వి, "వీళ్ళ నందరనూ చంపించింది నేనే! కాని, తినటానికి మాత్రం కాదు," అన్నాడు.

నల్లవాడు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ, "తినటానికి కాకపోతే ఇంతమందినీ వృథాగా యెందుకు చంపినట్లు?" అని ఎదురు ప్రశ్న వేశాడు నిర్భయంగా.

మెహర్ చక్రవర్తి సేనానితో, "వీడు కేవలమూ అనాగరికుడు. వీడికి నచ్చేటట్టు మనం తెలియచెప్పడం అసాధ్యం," అన్నాడు.

అంతట, చక్రవర్తి వెనుకపక్కగా యెవరో నవ్వుతూన్నట్లు అలికిడి అయింది. మెహర్ గభీమని వెనుకకు తిరిగి చూసే సరికి, ఆ ప్రాంతాలగల అడవులలో తపస్సు చేసుకొనే ఫకీ రొకడు ఎదట ప్రత్యక్షమయాడు.

"మహాత్మా, నవ్వారెందుకు?" అని అడిగాడు మెహర్ విస్మయంతో.

"సుల్తాన్! నీవు అనాగరికుడని భావించే ఈ నరమాంస భక్షకుడు ఆకలి తీర్చుకోటానికేగాని, అనవసరంగా తోటి మానవుల ప్రాణం తీయడు. నీవో? సామ్రాజ్యాన్ని వ్యాపింప చెయ్యాలన్న కాంక్షతో యుద్ధాలు తలపెట్టి, లక్షలాది మానవుల ప్రాణాలు నిష్కారణంగా తీయించుతున్నావు. అవునా? ఒక్కక్షణం ఆలోచించు, ఇప్పుడు మీ ఇద్దరిలో అనాగరికులెవరో నీకే తెలుస్తుంది!" అన్నాడు ఫకీరు పిడుగులు పడినట్టుగా పలుకుతూ.

ఫకీరు మాటలలోని సత్యాన్ని గ్రహించి మెహర్ సిగ్గుతో తలవంచుకున్నాడు.

అంతేకాదు, ఆ క్షణమందు అతని మనస్సే పూర్తిగా మారిపోయింది. "ఇక ఈ రోజునుంచి యుద్ధమనే మాటనే తలపెట్ట" నని నిశ్చయించుకున్నాడు.






శుకుడి మాటలకు వ్యాసుడు, "నాయనా, నూరు సంవత్సరాలు తపస్సు చేసి నిన్ను కన్నాను. నాకు ఎదురు రాకు. నీకు యౌవనం వచ్చింది. పెళ్ళాన్ని తెచ్చుకుని, సుఖపడు. ఏ రాజునైనా చూసి డబ్బు తెస్తాను. నీకు డబ్బు కొరత లేకుండా చూస్తాను," అన్నాడు.

"పెళ్లితో సుఖం వస్తుందంటే ఎలా నమ్ముతాను? పెళ్ళి చేసుకుని, నానా కష్టాలూ పడుతూ, అవే సుఖాలనుకుని, సంసార కూపం నుంచి బయటికి రాలేక క్షీణించే వారిని చూస్తున్నాను గదా! దుఃఖంతో కూడిన సౌఖ్యాన్ని సుఖం అనవచ్చునా? సంకెళ్ళ నుంచి విముక్తి ఉంటుంది గాని, ఆడదాని మమకార పాశంలో చిక్కుకున్న వాడికి విముక్తి లేదు. అలాటి సుఖాన్ని ఎలా కోరి వరించను?" అన్నాడు శుకుడు.

"మనసును అదుపులో పెట్టి, నిర్మలంగా ఉంచుకోవటమే ముక్తికి మార్గం. అంతేగాని మరేవీ బంధాలు కావు. న్యాయంగా ధనం సంపాదిస్తూ, అబద్ధ మాడక, శౌచం విడవక, విద్యుక్తమైన ధర్మాలు చేస్తూ గృహస్థు ముక్తి పొందుతాడు, నాయనా. గృహస్థుడుగా ఉంటూ, అతిథులను ఆదరిస్తూ, వానప్రస్థులకూ, సంసారులకూ అండగా ఉంటూ, అన్ని ధర్మాలూ ఆచరించి చివరకు ముక్తి పొందవచ్చు. అందుకనే గదా వసిష్ఠుడు మొదలైనమహర్షులందరూ గృహస్థాశ్రమం

**4. శుక - జనక సంవాదం**



స్వీకరించారు? వేదోక్త కర్మలు జరపాలంటే గృహస్థాశ్రమం తప్ప మరో మార్గం లేదు. దానికి ఇతర ఆశ్రమాలు సాటి రావు. అంతేగాక, పంచేంద్రియాలు మహా బలవత్తరమైనవి. భార్యలేని వాణ్ణి అవి అవలీలగా అధోలోకానికి తోస్తాయి, వాడెంత గొప్ప పండితుడైనా సరే! ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవటానికి పెళ్ళాడాలి. ముసలితనం వచ్చాక తపస్సు చెయ్యాలి," అన్నాడు వ్యాసుడు.

శుకుడు ఈ వాదనలను ఆమోదించక, సంసారాన్ని నిందిస్తూ ఇలా అన్నాడు:

"ఇల్లు ఉరితాడు. డబ్బు లేకపోతే అయినవారి మధ్య అవమానం, డబ్బు సంపాదనకు ఎన్నో పాట్లు! మూడు లోకాలూ ఏలే ఇంద్రుడి కన్న సన్యాసి సుఖి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు మాత్రం సుఖం ఎక్కడ ఉన్నది? ఏ దానవుణ్ణి ఎలా చంపాలా అన్న చింతే గదా వారికి? ఈ లోకంలో బీదవాడికే కాదు, ధనికుడికి కూడా సుఖం లేదు. నాకు విజ్ఞానాశ్రయమైన మార్గం చెప్పు."

తన కొడుకు బుద్ధి వైరాగ్యంలోనే ఉన్నదని గ్రహించి వ్యాసుడు, "నాయనా, ఒకప్పుడు నేను ముక్తినియ్యగల దేవీ భాగవతం రచించాను. దాన్ని చదివి, జ్ఞానివికా," అంటూ ఇలా చెప్పాడు:

విష్ణువు మర్రిఆకు మీద పిల్లవాడుగా ఉండి, "నేనిక్కడ పిల్లవాడి రూపంలో ఎందుకున్నాను? నన్ను ఎవరు సృష్టించారు? ఈ విషయాలు నాకు ఎలా తెలుస్తాయి?" అని విచారిస్తూంటే, అతన్ని చూసి జాలిపడి దేవి అతనికి సగం శ్లోకం చెప్పి, "ఇదే సమస్తమూనూ. దీన్ని తెలుసుకుంటే నన్నెరిగినట్టే," అన్నది.

విష్ణువు ఆ సగం శ్లోకాన్ని విన్నాడు గాని, అర్థం చేసుకోలేకపోయాడు. అతను ఇలా ఆలోచించాడు: "దీన్ని నాకిచ్చిన వారెవరు? ఆడదా? మగవాడా? ఏదీ కాదా?"

అతను ఆ సగం శ్లోకాన్ని పఠించ సాగాడు. అంతలో మహాదేవి నాలుగు చేతులలో శంఖ, చక్ర, గదాదులు ధరించి, మేలిమి బంగారు బట్టలు కట్టి, తనలాటి వారే అయిన శక్తులను వెంటబెట్టుకుని విష్ణువు ఎదట ప్రత్యక్షమయింది.

విష్ణువు ఆమెను చూసి దిగ్భ్రాంతుడై ఏమీ అనలేకపోయాడు. అప్పుడామె అతనితో, "మాయ మూలంగా నన్ను మరచావు. ఇప్పుడు నువు సగుణుడివి. నేను సత్త్వశక్తిని. నీ బొడ్డు కమలంలో బ్రహ్మపుట్టి, రజోగుణం గలవాడై అన్ని లోకాలూ సృష్టి చేస్తాడు. అతను చేసిన సృష్టికి నువు పాలకుడవుగా ఉంటావు. ఆ బ్రహ్మదేవుడి కనుబొమల మధ్యనుంచి, క్రోధవశాన రుద్రుడు పుట్టుకొస్తాడు. ఆ రుద్రుడు తీవ్రమైన తపస్సుచేసి, దాని మూలంగా తామసగుణం కలిగినవాడై, ప్రళయకాలంలో, బ్రహ్మ సృష్టించిన ప్రపంచాన్ని నాశనం చేస్తాడు. నువు నా సహాయంతోనే ప్రపంచాన్ని పోషించ వలసినవాడివి కనక సత్త్వశక్తినైన నన్ను గ్రహించు. నేను ఎల్లప్పుడూ నీ వక్ష స్థలంలోనే ఉంటాను," అన్నది.

ఆమెతో విష్ణువు, "నాకు ఒక అర శ్లోకం వినబడింది. దాన్ని నేను ఎలా విన్నానో నువు చెప్పు," అన్నాడు.



"నన్ను సగుణగా నువు చూస్తున్నావు. నీ కా అర్ధశ్లోకం చెప్పినది నిర్గుణస్వరూపి అయిన పరదేవత. ఇది భాగవతమనే పేరు గల మంత్రం. ఆ పరదేవత నీకీ మంత్రం చెప్పింది. దీన్ని విడవకుండా పఠించితే శుభాలు కలుగుతాయి," అన్నదామె.

విష్ణువు ఆ మంత్ర బలంతోనే మధు కైటభులను చంపి, వారికి భయపడి తనకు శరణుజొచ్చిన బ్రహ్మకు దాన్ని ఉపదేశించాడు. బ్రహ్మ నారదుడికీ, నారదుడు వ్యాసుడికీ ఉపదేశించారు.

వ్యాసుడు దాన్ని శుకుడికి ఉపదేశించి, "దీన్నే నేను అనేక సంహితలుగా విస్తరించి రచించాను," అన్నాడు.



శుకుడు ఆ మంత్రాన్ని పఠించుతూ ఆశ్రమంలో ఉండిపోయాడు. అయితే శుకుడు చాలా విచారంగా ఉండటం చూసి వ్యాసుడు, "నా కొడుకువైయుండి విజ్ఞానం కోసం ఇంత విచారం దేనికి? నా మాటలు నీకు నచ్చకపోతే ఇంకొక పని చెయ్యి. మిథిలానగరంలో జనకుడు అనే రాజున్నాడు. అతను 'పరమ శాంతుడూ, గొప్పజ్ఞానీనూ. అతన్ని అడిగి నీ సందేహాలన్నీ తీర్చుకో,'' అన్నాడు.

''రాజరికానికీ, జ్ఞానానికీ ఏమైనా సంబంధం ఉన్నదా? రాజ్యపాలన అన్ని పాపాలకూ మూలం గద! అలాటప్పుడు ఈ జనకుడు ఎలా జ్ఞాని అయినాడో చూడాలని ఉన్నది. వెళ్ళివస్తాను,'' అన్నాడు శుకుడు.

''వెళ్ళిరా, నాయనా! నా ప్రాణాలన్నీ నీ మీదనే ఉన్నాయి. నీ సంశయాలు తీర్చుకుని, వెంటనే తిరిగి వచ్చెయ్యి,'' అని వ్యాసుడు తన కొడుకును సాగనంపాడు.

### మిథిలలో శుకుడు

శుకుడు తండ్రికి నమస్కరించి, సెలవు పుచ్చుకుని, దారిలో తగిలిన అనేకదేశాలూ, అరణ్యాలూ, పర్వతాలూ, క్షేత్రాలూ, మునుల ఆశ్రమాలూ చూస్తూ మేరుపర్వత ప్రాంతాన్ని రెండేళ్ళలో దాటి హిమాలయ ప్రాంతాన్ని ఏడాదిలో దాటి, మిథిలానగరం చేరి, అక్కడ వింతలు చూస్తూండగా ద్వారపాలకు డొకడు, ''నువ్వెవరు? ఏం పనిమీదపోతున్నావు?" అని అడిగాడు.

శుకుడు వాడికి ఏ సమాధానమూ చెప్పక, నగరద్వారం వెలపల రాయిలాగా కూర్చున్నాడు.

''మాటా పలుకూ లేకుండా లోపలికి వెళ్ళటానికి అనుమతి అవసరం లేదనుకున్నావా? వేదాలు చదివిన బ్రాహ్మణుడి లాగా కనబడుతున్నావు. నీ కులగోత్రాలూ, ఎక్కడినుంచి వస్తున్నదీ రాజుతో నీకు గలపని ఏమిటో చెప్పకుండా లోపలికి

పోవటానికి వీల్లేదు," అని ద్వారపాలకుడు మళ్ళీ అన్నాడు.

దానికి శుకుడు, "నేను రాజుతో ఏం పని ఉండి వచ్చానో, ఆ పనిని ద్వారం దగ్గిర నువే తీర్చావు, ఇంక విచారం దేనికీ? నేను ఏ కష్టాలనూ లక్ష్యపెట్టక, మేరుపర్వతం దాటి, హిమాలయం దాటి, ఈ రాజును చూడాలన్న దురాశతో రావటం నాదే తప్పు! సాధారణంగా డబ్బుకోసం మనుషులు దేశాల వెంట తిరుగుతారు. ధనాశలేకపోయినా, నాకర్మ కొద్దీ నేను దేశాలన్నీ తిరిగాను. ఎక్కడి మేరుపర్వతం? ఎక్కడి మిథిల? కాలి నడకన ఇంత దూరం వచ్చానంటే అది నా ప్రారబ్ధమే తప్ప, ఫలితం ఏమైనా ఉన్నదా? నేను పడ్డ శ్రమకు ఫలిత మేమిటీ అంటే, ఎవడో సేవకుడు నగర ద్వారం దాటి లోపలికి పోకుండా అడ్డ పడ్డాడు!" అన్నాడు.

ఇతనెవరో గొప్పవాడని ద్వారపాలకుడికి తెలిసింది. వాడు శుకుణ్ణి సమీపించి, వినయంగా, "అడ్డుపెట్టి నందుకు నన్ను క్షమించి, లోపలికి వెళ్ళండి. మిమ్మల్ని అడ్డగల వారెవరు?" అన్నాడు.

"నీ విధి నువు నెరవేర్చితే అది తప్పు ఎలా అవుతుంది? నీదేమున్నది? రాజు నిన్నుఅలా ఆజ్ఞాపించాడు. నిజానికి రాజుదీ




తప్పుకాదు. ఆలోచించకుండా ఇక్కడికి వచ్చిన నాదే తప్పు," అన్నాడు శుకుడు.

ద్వారపాలకుడు అతన్ని లోపలికి వెళ్ల మన్నాడు. శుకుడు లోపలికి వెళ్ళి రాజ మందిరం చేరేసరికి, అక్కడి ద్వార పాలకుడు అడ్డపడ్డాడు. శుకుడు శిలలాగా అక్కడే నిలబడి వుండగా, అటుగా ఒక మంత్రి వచ్చి, శుకుడికి నమస్కారం చేసి, అతన్ని తీసుకుపోయి, అందమైన రాజోద్యానంలో అతిథిసత్కారాలు జరిపి, అన్ని కళలలోనూ అసాధారణ ప్రజ్ఞగలిగి, అప్సరలను మించే అందగత్తెలైన భోగ స్త్రీలను శుకుడికి పరిచర్యలు చేయటానికి ఏర్పాటుచేసి, వెళ్ళిపోయాడు.



అతనికోసం నియోగించబడిన వేశ్యలు అతనికి రకరకాల భక్ష్యభోజనాలు ఇచ్చి, అతన్ని సంతోషపెడుతూ, అతని అంద చందాలు చూసి మోహించి, తమ మోహాన్ని సూచించారు. కాని శుకుడు ఏమీ చలించలేదు. అతను ఇంద్రియా లను జయించినవాడని గ్రహించి, ఆ స్త్రీలు అతనికి మామూలుసేవలు చేస్తూ, రాత్రి అతను సుఖంగా పడుకోవటానికి పడక అమర్చారు.

శుకుడు ఆ రాత్రి నిద్రపోయి, తెల్లవారు ఝామునేలేచి, తెల్లవారేదాకా ధ్యానంలో ఉండి, కాలకృత్యాలు తీర్చుకుని, మళ్ళీ తపస్సమాధిలోకి వెళ్ళిపోయాడు.

శుక—జనక సంవాదం

జనకుడు శుకుడు వచ్చిన సంగతి తెలిసి, తన పురోహితుణ్ణి వెంట బెట్టుకుని వచ్చి, శుకుడికి అర్ఘ్యం ఇచ్చి, కుశల ప్రశ్నలుచేసి, ఒక గోవును ఇచ్చి గౌర వించాడు.

జనకుడు శుకుడి రాకకు కారణం అడి గాడు. దానికి శుకుడు, "రాజా, మా తండ్రి వ్యాసుడు నాకు ఉపనయంచేసి, నన్ను పెళ్ళి చేసుకోమన్నాడు. నేను సంసార బంధాలకు భయపడి చేసుకోనన్నాను. ధర్మార్థ కామ మోక్షాలు సాధించటానికి గృహస్థాశ్రమం ఉత్తమ మార్గం అని ఆయన అంటే నేను ఒప్పుకోలేదు. మిథిలానగరం వెళ్ళి, జనకమహారాజు ద్వారా నీ అనుమానం తీర్చుకో అని ఆయనన్నాడు. నేను మోక్షం కోరు తున్నాను. నా కేది కర్తవ్యం?" అన్నాడు.

దానికి జనకుడు ఇలా చెప్పాడు:

"మోక్షం కోరినవాడు మొదట ఉపనయం చేసుకుని, వేదం చదివి, గురుదక్షిణ చెల్లించి, గురువు ఆనతిపొంది భార్యను పెళ్ళాడి, ఆచారనియమాలను పాటిస్తూ, కర్మలు చేస్తూ, సంసారం చెయ్యాలి, కొడుకులనూ, మనమలనూ కనాలి, తరవాత అడవులకు పోయి, వానప్రస్థం జరుపుతూ, కామక్రోధాదులను

జయించి, అగ్నులను తనలోనే ఆవహింప జేసి, వైరాగ్యం అవలంబించి, భార్యను వదిలేసి సన్యాసం స్వీకరించాలి. అంతే గాని అరంభంలోనే సన్యాసం తీసుకోవటం అసందర్భం. పూర్తి వైరాగ్యం కలిగినాకనే సన్యాసం పుచ్చుకోవాలి. నలభైఎనిమిది సంస్కృతులున్నాయి. అందులో నలభై గృహస్థుడివి, ఎనిమిది సన్యాసివి.''

''రాజా, మనసులో వైరాగ్యం నెల కొన్నప్పుడు సన్యాసం పుచ్చుకోవటంలో తప్పేమిటి?'' ఇని శుకుడు అడిగాడు.

''నాయనా, ఇంద్రియాలు జయించ రానివి. ఎంత గొప్ప పండితుడు కూడా వాటికి లొంగిపోకతప్పదు. ఇక మామూలు మనుషుల సంగతి చెప్పేదేమిటి? అడు గడుగునా మనిషికి వికారాలే—తిండి కోరిక, నిద్రకోరిక, సుఖాలకోరిక, పుత్ర కాంక్ష ఇవన్నీ సన్యాసికి ఎలా తీరుతాయి? కోరికలను అదుపులో ఉంచేదెలా? అందు కనే అన్ని భోగాలనూ అనుభవించి తర వాత వదిలెయ్యాలి. అంతేగాని ముందు గానే వదిలెయ్యటం ఎలా? ఎత్తున పడు కున్నవాడు పడిపోక తప్పదు గదా! ఎవడైనా సన్యసించి, వైరాగ్యం అవలం బించలేక, భోగాలమీద ఆసక్తి కలవాడైతే వాడికి నరకప్రాప్తే. జ్ఞానం క్రమంగా సంపాదించి తరవాత సన్యసించాలి. మనస్సు ఒకంతట లొంగిరాదు. దాన్ని నింపాదిగా సరి అయిన మార్గాకి తీసుకు రావాలి. గృహస్థుడుగా ఉంటూనే, శాంతం అవలంబించి, లాభంవస్తే పొంగి పోవటమూ, నష్టం కలిగితే కుంగి పోవటమూ లేకుండా, త్యాగమయమైన జీవితం గడిపే వాడికి చివరకు మోక్షం కలుగుతుంది. నన్ను చూడు. నేను ఎన్ని భోగాలైనా అనుభవిస్తున్నాను. ప్రజలు మెచ్చేటట్టు రాజ్యం చేస్తున్నాను. యథే చ్ఛగా జీవిస్తున్నాను. ఐనా మనస్సును అతి నిర్మలంగా ఉంచుకుంటున్నాను. చచ్చి మోక్షం పొందుతాను. నువు కూడా అలాగే జీవించవచ్చు గద!'' అంటూ జనకుడు శుకుడికి ఉపదేశం చేశాడు.





# నగరంలో ఉద్యోగం

చలపతీ, శేషాద్రీ చదువులు పూర్తిచేసి, నగరంలో ఉద్యోగం చెయ్యాలన్న మోజులో ఉన్నారు. నగర పాలక సంస్థలో ఖాళీలు ఉన్నట్టు తెలిసి, ఇద్దరూ దరఖాస్తులు పంపుకున్నారు. ఫలానా రోజున ఉద్యోగుల ఎన్నిక జరుగుతుందని ఇద్దరికీ కబురు అందింది.

చలపతి తండ్రికి ఒక స్నేహితుడున్నాడు. ఆ స్నేహితుడికి కావలసిన మనిషి మురహరి అనే ఆయన నగరంలో ఉంటున్నాడు. అందుచేత తండ్రి చలపతితో సత్రంలో దిగవద్దనీ, మురహరి ఇంటికి వెళ్ళమనీ చెప్పి, తన స్నేహితుడి చేత మురహరికి ఒక లేఖ రాయించి చలపతికి ఇచ్చాడు.

చలపతి మురహరి ఇంటికి వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు గాని, శేషాద్రి, ముక్కూ, ముఖమూ తెలియని వారింట దిగటం ఏమాత్రమూ ఇష్టంలేక సత్రంలో దిగుతానన్నాడు. వాళ్ల ప్రయాణం అనుకున్నంత చురుకుగా జరగక, ఉద్యోగస్తుల ఎన్నికకు ముందు రోజు సాయంత్రం నగరం చేరవలసిన వాళ్ళు, మర్నాడు చివరి ఝాములో అక్కడికి చేరారు. తెల్లవారితే ఉద్యోగుల ఎన్నిక!

శేషాద్రి సత్రం వెతుక్కుంటూ వెళ్లిపోయాడు. కాగితంమీద రాసి ఉన్న చిరునామానుబట్టి తాను బసచేయవలసిన ఇల్లు సులభంగానే తెలుసుకుని చలపతి అక్కడికి చేరాడు.

అయితే అతను తలుపు తట్టకముందే ఒక నలభైఏళ్ళ మనిషి, తలుపు తెరుచుకుని, ప్రయాణం చేయబోతున్నవాడిలాగా పెట్టె ఒకటి చేతబట్టుకుని బయటికి వచ్చాడు.

మాచిరాజు కామేశ్వరరావు

''మురహరిగారిల్లు ఇదేనాండీ ?'' అని చలపతి ఆ మనిషిని అడిగాడు.

''అవును, ఇదే. నేనే మురహరిని. మీరెవరు?'' అని ఆ మనిషి చలపతిని అనుమానంగా చూస్తూ అడిగాడు.

చలపతి తన విషయం ఆ మనిషికి చెప్పి, ''తెల్లవారితే పరీక్ష. అలసిపోయి ఉన్నాను. కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని వచ్చాను,'' అన్నాడు.

ఆయన ఎంతో నొచ్చుకుని, ''మా అన్నగారికి ఒంట్లో ఏమీ బాగాలేదని కబురు అంది, కంగారుగా బయలుదేరుతున్నాను. ఇల్లు మీదే అనుకోండి. రేపు సాయంత్రానికి వచ్చేస్తాను,'' అని వెళ్ళిపోయాడు.

లంకంత ఇల్లు! చలపతి ఒకసారి ఇల్లంతా చుట్టి, మధ్యగదిలో మంచం వాల్చుకుని, పడుకున్నాడు. అతనికి కునుకుపట్టినట్టన్నా అనిపించకుండానే తలుపు ఎవరో దడదడ బాదారు. చలపతి ఉలిక్కిపడి లేచి తలుపుతీశాడు. బయట బాగా తెల్లవారిపోయింది. ఇంటి బయట పదిమంది మనుషులు కర్రలు పట్టుకుని నిలబడి ఉన్నారు. తలుపు తెరిచిన మరుక్షణం వాళ్ళు చలపతిమీదికి ఉరికి, పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు.

వారి వెంట ఉన్న ఒక ముసిలాయన, ''నేను రాననుకుని, దొంగవెధవ చుట్టంలా ఇంట్లో తిష్ఠవేశాడు! ఎందుకయినా మంచిది, డబ్బూ, నగలూ



చూసుకుంటాను,'' అని లోపలికి వెళ్లీ, పెట్టె తెరిచి చూసుకుని, గుండెలు బాదుకుంటూ, ''నగలులేవు, డబ్బులేదు, ఈ దొంగవెధవ ఎవరికో ఇచ్చి పంపించేసి ఉంటాడు!'' అంటూ చలపతి పీక పట్టుకున్నాడు.

''నేను దొంగనుకాను. నాకేమీతెలీదు. ఇంతకుముందే ఇక్కడికి వచ్చాను,'' అని చలపతి జరిగినదంతా చెప్పాడు.

''అంతా అబద్ధం! నీ తోడుదొంగ ఎక్కడ ఉంటాడో చెప్పు!'' అంటూ చలపతి వీపుమీద నాలుగు దెబ్బలు వేశాడు ముసలాయన.

చలపతి అవమానంతో కుంగిపోయాడు. ఉద్యోగ పరీక్ష సమయం అయిపోతున్నదని ఒకపక్క ఆందోళన! కొత్త ఊరూ, కొత్త మనుషులూనూ! ఈ ఊళ్లో తనను ఎవరు గుర్తించుతారు? తనకు ఇల్లు అప్పజెప్పినవాడు దొంగ అన్నమాట! నగరంలో దొంగలు అంత ఘరానాగా ఉంటారన్నమాట!

అతను అందరికీ దణ్ణాలు పెట్టి, ''ఆ మనిషి దొంగ అని నాకు తెలీదు. నేనిక్కడికి ఉద్యోగంకోసం వచ్చాను. మా నాన్నగారి మిత్రుడు ఈ చిరునామా కాగితం ఇచ్చాడు. ఇంతకూ ఇది మురహరిగారి ఇల్లు కాదా?'' అంటూ తన వద్దఉన్న లేఖ వారికి చూపాడు.

మురహరి ఆ ఇల్లు ఖాళీచేసి ఆరు నెలలయిందట.



''వీణ్ణి గదిలో బంధించి ఆ మురహరిని పిలుచుకు రండి,'' అని ఎవరో సలహా ఇచ్చారు. చలపతిని గదిలోకి తోసి గొళ్లెం పెట్టి, మురహరిని పిలుచుకుని వచ్చారు. అప్పటికి మధ్యాహ్నమయింది. అప్పటికి చలపతి, ప్రయాణపు బడలికతోనూ నిద్రచాలకా, పరీక్ష మించిపోతున్న ఆందోళనతోనూ సగం చచ్చిఉన్నాడు.

మురహరి వచ్చి చలపతి వద్ద ఉన్న లేఖ తీసుకుని చూసి, ''ఇది నా మిత్రుడు రాసినదే. ఈ అబ్బాయిని నేను లోగడ చూడలేదు గాని, ఇతను నిశ్చయంగా మా ఊరివాడే.'' అన్నాడు.

అందరూ చలపతికి క్షమాపణ చెప్పుకుని, అతన్ని విడిచిపెట్టారు. మురహరి అతన్ని తన ఇంటికి ఆహ్వానించాడు. కాని చలపతి, ''మీరు నాకివాళ మహోపకారం చేశారు, ఇక నేను మా ఊరు తిరిగి పోతాను. ఇక్కడ పరీక్ష అయిపోయింది.'' అంటూ ఆ ఇంటినుంచి బయటపడ్డాడు.

శేషాద్రి చలపతికి ఎదురువచ్చి, ''పరీక్షకు రాలేదేం?'' అని ఆదుర్దాగా అడిగాడు.

చలపతి జరిగినదంతా చెప్పాడు. అంతా విని శేషాద్రి, ''నీకు నగరంలో ఉద్యోగం సరిపడదు. నగరంలో మోసాలు సర్వసామాన్యం. అయితే వాటిని తెలివిగా ఎదుర్కోవాలి. నువు ఏంచెప్పినా ఆ స్థితిలో వాళ్ళు వినరు కాబట్టి, దొంగను చూపిస్తానంటూ వారిని నగరపాలక సంస్థకు తీసుకురావలిసింది. అక్కడ నేను ఉంటాను. మన దరఖాస్తులు సంస్థలో ఉంటాయి. వాటిని పట్టి నువు దొంగకాదని తేలికగా రుజువయ్యేది. నువు పరీక్షకు హాజరుకూడా అయేవాడివి. నన్ను రెండురోజుల్లో ఉద్యోగంలో చేరమన్నారు. ఈలోగా నిన్ను మీ నాన్నకు అప్పజెప్పివస్తా,'' అన్నాడు.

చలపతి తమ ఊరుచేరి వ్యవసాయం ప్రారంభించాడు.



# గురువు శిష్యుడాయె!

ఒక స్వాములవారి దగ్గిర ఇద్దరు, ముగ్గురు శిష్యులుండేవారు. వారిలో సదానందు డనేవాడు చాలా తెలివిగలవాడు.

ఈ స్వాములవారి ఉపన్యాసాలు చాలా జనరంజకంగా ఉండేవి. సదానందుడు, అవకాశం దొరికితే, తాను కూడా అలా జనరంజకంగా ఉపన్యసించగలననుకునేవాడు. అతను సాహసించి ఒకనాడు తన కోరిక గురువుగారికి చెప్పాడు. అవకాశం వచ్చినప్పుడు అలాగే చెయ్యమన్నాడు గురువు.

ఒకసారి చాలా దూరగ్రామం నుంచి స్వాములవారికి ఆహ్వానం వచ్చింది. అక్కడ తమను ఎవరూ ఎరగరు గనక, సదానందుడికి కాషాయ బట్టలు కట్టించి, అతను స్వాములవారు గానూ, తాను శిష్యుడుగానూ స్వాములవారు బయలుదేరాడు.

మోసం పారింది. వెళ్ళినచోట సదానందుడు అనర్గళంగా ఉపన్యసించాడు. గురువు కూడా తృప్తిపడ్డాడు. అయితే అనుకోని చిక్కు వచ్చిపడింది. శ్రోతలలో అయిదుగురు అయిదు ప్రశ్నలు వేశారు. సదానందుడికి సమాధానాలు తెలియవు. అందుకని సమయస్ఫూర్తితో అతను, "ఈ చిన్న ప్రశ్నలకు నా శిష్యుడు సమాధానం చెబుతాడు," అన్నాడు.

స్వాములవారు ఆ ప్రశ్నలకు సమాధానాలిచ్చి, గ్రామస్థులకు పరమానందం కలిగించాడు.



